# సూ క్తి ని ధి



మి న్ని కం టి గు రు నా థ శ ర్మ

# సూక్తినిధి

రచయిత

ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ, కవిశేఖర
**మిన్నికంటి గురునాథశర్మ**
ప్రధానాంధ్రోపాధ్యాయులు, హిందూకాలేజి హైస్కూల్,
గుంటూరు.

ముద్రాపకులు
శ్రీ ఏకా ఆంజనేయులు పంతులుగారు

# విజ్ఞప్తి

సుకవులు పండితులు ప్రసంగించుచు నవసరమునకుఁదగిన శ్లోకములం జదివి శ్రోతల నానంద మగ్నులం జేయుచుందురు. అట్టి ప్రస్తావనోచితములు పద్యములు తెనుఁగున మిక్కిలి తక్కువ. అందువలన నేనిదివఱకు "అడవి పువ్వులు" అను పుస్తకము వ్రాయ విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ముద్రింపించి యనుగ్రహించిరి.

ఇప్పుడీ 'సూక్తినిధి' వ్రాసితి. ఇందు నీతిలీల రెండాశ్వాసములు భావలీల రెండాశ్వాసములు మొత్తము నాల్గాశ్వాసములు గలవు. అందుఁ బ్రథమాశ్వాసము మా నాయనగారు వేంకటలక్ష్మయ్యగారు వ్రాసికొనియుంచుకొన్న శ్లోకముల కనువాదము. రెండవ యాశ్వాసము స్వీయము.

మూఁడవ యాశ్వాసము భావశతకమున కనువాదము. దానిని సంస్కృతమున నాగరాజు రచించెను. అతఁడు ధారానగరాధీశ్వరుఁడు టాక వంశజుఁడు. తండ్రి జాలప్ప. తాత శ్రీవిద్యాధరుఁడు. కర్పటి గోత్రము. ఈ యాంధ్రీకరణమునఁ గొన్నియెడల భావమునందుకొనుటకుఁదగిన పదములు ప్రయోగించుచు స్వాతంత్ర్యము చూపితిని. విజ్ఞులరయుదురు గాక. నాల్గవ యాశ్వాసము స్వకపోల కల్పితము.

ఈపొత్తమున కేవేని రెండు ముక్కలువ్రాసి త్వరగాఁ బంపుఁడని యుద్దండపండితుఁడు మహాకవి. ఉత్తమజీవయాత్రాది బహు గ్రంథకర్త సదాచార సంపన్నుఁడు బ్రహ్మవేత్త సహృదయుఁడునగు బ్రహ్మశ్రీ నాదెళ్ల మేథా దక్షిణామూర్తి శాస్త్రిలవారి నభ్యర్థించితిని. వారునన్ను సోదరునిగా భావించి యాదరించుచున్నవారగుటచే నొకటి రెండు దినములలో వ్రాసి పంపిరి. వారి యీ సౌభ్రాత్రమును గొండాడనేరక యొక్క నమస్కారము మాత్రము సమర్పించెదను. అభిప్రాయము లొసంగిన పండిత కవులకు నంజలించెద.

ఈనిధిని నలుగురికంటఁ బడఁజేసిన రసిక శిఖామణి వదాన్యోత్తముఁడునగు బ్రహ్మశ్రీ ఏకా ఆంజనేయులుపంతులుగారికి దీర్ఘాయురారోగ్య భాగ్యములొసంగ భగవంతునిఁ బ్రార్థించెదను.

గుంటూరు
24-3-1958

గురునాథశర్మ

# అచ్చు ముచ్చట

ఒకనాఁటి పరిణతదివసంబున (శ్రీ) ఏకా ఆంజనేయులు పంతులుగారు తమ ఆఫీసుగదిలో (శ్రీ) తూములూరి నాగభూషణము, బి. ఏ., బి. యల్., (శ్రీ) రామరాజు లక్ష్మీనారాయణ, బి. ఏ., బి. యల్., మున్నగు సుహృత్పండిత కవులతోఁ గోష్ఠి సలుపుచోఁ బ్రస్తావవశంబున నేను జదివిన పద్యముల కలరి యెక్కడి వా పద్యము లనిరి. నేనివి నావ్రాఁతపొత్తములోనివి. అవి యెప్పుడు నలుగురి కంటఁబడునో? యంటిని. వెంటనే పంతులుగారు పకపకనవ్వుచు 'అదిగో అదే 'నియోగపుముష్టి' అనియాకథనుజెప్పి యందఱనవ్వించిరి. ఆవలఁ గొంతతడవునకు నేను సెలవు పుచ్చుకొనలేవఁగాఁ బంతులుగారు రెండు పెద్ద నోట్లిచ్చి పట్టిన కాగితము ముందుగాఁ గొనుఁడు. అచ్చైనపిదపఁ దక్కిన దెంతైన నంతయిచ్చెదననిరి. ఈ త్యాగధనుని చిత్ర చర్యలిట్లుండును.

ముద్రణద్రవ్యదాత

## శ్రీ ఏకా ఆంజనేయులు పంతులుగారు

సీ. అటుకవి పద్యమ్ము లాలించుచుండును
ఇటుపూర్వకృతి పఠియించుచుండు
అటు 'ఫోను'లో మాటలాడుచునుండును
ఇటుముచ్చటించు స్నేహితులతోడ
అటు యాచకుల కిచ్చి యంపుచునుండును
ఇటునోట్ల కట్టలనెంచుచుండు

అటు 'దస్కతులు' పెట్టి యంపుచు గా గీతముల
ఇటు లేఖలనుచు వ్రాయించుచుండు
అటు కార్మికులపైఁ గటాక్షము పరగించు
ఇటు గుమాస్తాలపై హృదయ ముంచు
నడుమనడుమ నారోగ్యముఁ దడవు కొనును
చుట్టుముట్టించి పోగపోకఁ జూచుచుండు
ఇంతపని పండ్లరసముతో నే యదేమి
యోపికయొ కాని ఆదిలక్ష్మీపతికిని.

కం. కనకాభిషేకమును సలు
పును దన పేరెత్తరాదు భువనవిజయముం
బొనరించు నుండుఁ దా మఱుఁ
గునఁ బెండ్లియనును గవీంద్రగోష్ఠిని జరపున్.

కం. కవితా ప్రియుండు రసభా
వవిదుం డౌచిత్యము పసిపట్టు కళావే
త్త వివేకి కానిచో ని
న్నివిధంబుల గౌరవించునే కవివరులన్.

ఉ. ఇచ్చెడి వారలుందురెట నేఁ దమయిక్కకు వచ్చి వేఁడఁగాఁ
జొచ్చినఁ దోఁచినంత మనసూరియొ యట్లడిగించు కోకము
న్నిచ్చుటె కాక యన్యులకు నేర్పడఁ జెప్పియొసంగఁ జేయు వి
ద్వచ్ఛయమిక్కుతంబున నెపట్టుట 'ఏక'యటంచుఁ బ్రోఢిగన్.

మ. ఎవరండీ ప్రబలాధిపత్యము చెలాయింపంగ నుంకింత్రుగా
క వరిష్ఠుండగు నాంజనేయుబలె లక్షద్రవ్యముంబోగు చే
సి విశాలంబగు సౌధరాజమును సృష్టింపించి స్త్రీవిద్యకై
వివిధోపాయము లన్మహాభ్యుదయమన్వేషించు వా రీపురిన్

మ. తగవున్ ధర్మువు నోర్పు నేర్పుగల పెద్దల్ కాక సామాన్యుఁడీ
వగ హైస్కూళ్లను నాలుగింటి వశమే పాలింప ? నీబర్యుకా
కోగి 'సంసత్తు'నుగూడ మోయుదుఁటయన్యూనప్రమోదంబుగ
ల్గఁగ, దేశోపకృతి క్రియారతుఁడ వేకా వెఙ్కమాంబాత్మజా.

మ. ఎదిపుణ్యం బెదిపాప మీవిషయమై యేదేశ మేమంచును
న్నది యాచారము మంచి చెడ్డల ప్రమాణత్వంబు నేరెట్టులెం
చెద రేదో పరతత్త్వమంచును విమర్శించున్ విదేశంబులె
ల్లదెసల్ గాంచినయాంజనేయబుధుఁడాహ్లాదింపఁగంబణ్డితుల్

ఉ. ఇంచుక మ్రొక్క వోయిన సహింపఁడు గౌరవరేఖ నెంతలా
భించెడి వృత్తినే విసరివేయును వామపదాన గాంధియె
ల్గించిన వెంటనే యుఱికెఁ గృష్ణజనిస్థలి కాత్మదేశభ
క్త్యంచితమానసుండగుచు నోర! స్వాతంత్రతపై నిమక్కువల్

తే. ఆదిలక్ష్మి నీ యింటిలో నడుగు పెట్టి
నీకు బంగారు పంట పండించి యిచ్చు
ఏమి ? పుండరీకాక్ష రాజేశ్వరులను
రత్నముల రెండు నీ కక్కఱకు నొసంగె.

మ. తనమిత్రావళిఁగూడఁ గట్టుకొనుటల్ ధైర్యంబుతో నక్రమం
బును జెణ్ణాడుట యుక్తియుక్తముగ సభ్యుల్ మెచ్చ మాటాడుటల్
ఘన విద్వాంసుల సత్కరించుటల నేకంబిట్టి సద్బుద్ధు లం
గనె నీ §'అంజి' భవత్ప్రథన్నిలుపు నేకా ఆంజనేయ ప్రభూ!

తే. ఆంజనేయుని బుండరీకాక్షు జనకుఁ
దత్పురుషు బహువ్రీహి నుదారదార
నాదిలక్ష్మిఁ గుటుంబము నేదు శౌరి
ఆయురారోగ్య భాగ్య భోగ్యము లొసంగి.

మిన్నికంటి గురునాథ శర్మ

---

§ 'అంజి' వాడుక పేరు. పెట్టిన పేరు అంజనీకుమార ఆత్రేయ. ఇతఁడు శ్రీపుండరీకాక్షరావు గారి పెద్దకొడుకు. శ్రీ పంతులుగారి పెద్దమనుమఁడు.

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# కవితా లీలా తరంగిణి

శ్లో॥ యా రాకాశశి శోభనాగత ఘనా సా యామినీ యామినీ
యా సౌందర్య విదగ్ధతా ప్రణయినీ సా కామినీ కామినీ
యా కాంతస్య ముఖే చిరాయ విరహే సా మాధురీ మాధురీ
యా లోకద్వయ సాధనీ తను భృతాం సా చాతురీ చాతురీ॥

లోకమందుఁ జాతుర్యము నానాకలాభిశోభితమై వెలయుచుండును. అందుఁ గవితా విలసితమైనది యిహమున సుస్థిరముగాఁదగ్గది. అయ్యది పరసాధకమునుగాఁదగు పథమున నడపుకోఁగల్గుటరచయిత సుకృతమే. ఈకాలమున నుభయసాధకములౌనవి క్వాచిత్కముగానే యగపడుచున్నవి.

అట్టి యెన్నికఁగనఁ జాలుకృతులందాంధ్రమున వెలయింపఁబడిన వానిలో 'శ్రీ గురుభాగవతాదులఁ' బేర్కొననౌను. తత్కర్త గర్తపురవాస్తవ్యుఁడైన శ్రీమిన్నికంటిగురునాథశర్మ యాసన్నషష్టిపూర్తియైయున్నవాఁడు. ఈతని ప్రజ్ఞాతిశయములెన్న 'నుభయభాషాప్రవీణ, వేదాంతపారీణ, కవిశేఖర' బిరుదములు సార్థకములేయని తద్గ్రంథ పఠితలౌ తత్తదభిజ్ఞులకు వేద్యములుగాఁ దగియున్నవన్న నింకెన్న నేమిటికి ? ఈమిన్నినా 'ఉత్తమజీవయాత్రిం'గన్నంతనే న'న్నన్న' యనఁదొడంగఁగా, వయసున నల్లె యాఁడును గదా యనుకొన్నవాఁడనైతిని.

ఇట్లున్నెడ భిన్నమాతృకలంగొన్నను, సమాన కథాయోగో న్నయకవితములేమైన 'శ్రీదత్తమహిమం' దానును 'శ్రీదత్తపు రాణము' నేనునునాంధ్రీకరింపంగనుటలో మాసాభాగ్యమున కాదత్తుండేతోడైనట్లుకాఁగాఁ దన "సూక్తినిధి"ని

గుణీగుణం వేత్తి న వేత్తి నిర్గుణో । బలీబలం వేత్తి న వేత్తి నిర్బలః
పికో వసంతస్య గుణం న వాయసః కరీ చ సింహస్య బలం న మూషికః॥

అనిలోకమున కందించి వేయక, లబ్ధప్రతిష్ఠుండవైయున్న వాఁడయ్యు నీనూతన వత్సరారంభముననే నాకడకుఁబంపుచు నాయుపోద్ఘాతము కలకాలముతనరచనయందుండనభిలషించితి ననివ్రాసెను. ఈగడియకు నాముక్కు మొగము నెఱుంగని యీ సోదరుఁ డిట్లువ్యాజానురాగమగపఱుపఁగా బహుళకార్యాంత రనిమగ్నతంగన్న వాఁడనయ్యునన్యథాకరింపనేరక వెనువెంటనే యందఁజేయవలెనన్నందునఁ గలమెట్లునడచినట్లే యొలికింపఁ బడిన యీనాయక్కరాలను లెక్కవెట్టుచు 'శ్రీకాళిదాసుగారి కైత....' కొంత యున్నట్లక్కఱమాలినదని యేపాఠకులయినను వెక్కసపడకుండ సూక్తినిధ్యుపభోగపూర్వ 'విలం' బారంభ నింబకుసుమభక్షణ మిదియను కొందుఁగావుతమన్న మనవితో నుపక్రమింతు.

సాధారణముగాఁ బూర్వకవీంద్ర విరచితములు పురా ణైతిహ్యాంధ్రీకరణములో ప్రబంధఫక్కిం ద్రొక్కినవో కాఁగా, లాక్షణికులౌ క్షేమేంద్రాదులచే నిర్ణీతములైన విధానముల

ననుసరించి కథావస్తువు నాశ్రయించిన రసోల్బణమున కాక రములై యుపక్రమోపసంహారములుగలవిగా నుండెడివి. అర్వాచీనములం దనేకములు "భావకవిత్వము" లన విశృంఖలములై విహంగమార్గముననడచుచున్నవి. మధ్యకాలమందలివి కొన్ని శతకములుంజాటువులుగా మొదలై నిల్చి, నవీనఖండకావ్యములకు మార్గదర్శకములుకాకపోలేదు. అందుఁ బ్రధానములైనవి భర్తృహరి శతకత్రితయము, సుమతిశతకము, వేమన్న పద్యాలు మున్నగాఁగల వెంతయుం బేర్మింగన్న వేయాయె. "వాక్యం రసాత్మకం కావ్య" మ్మనుటకివియు లోకులరసనలేయాకులై యనూనవ్యాప్తింగని పరంపరాగతములౌచుండు నుక్తులింకెన్నైనను నిదర్శనములుగా నెన్నందగియున్నవి.

అందం దేయేశబ్దములకుఁగాని వాక్యములకుఁగాని స్పష్టార్థముగాక మనమునకువిశేషార్థము స్ఫోరకమౌనెడ నద్దానిని ధ్వనిఅందురు. అదేప్రధానముగాఁగలయది 'కావ్య'శబ్దపరిగణనమందుత్తమమౌనదిగను నచ్చటచ్చటమాత్రమే యగపడి గుణీభూతవ్యంగ్యాపరనామకమౌనది మధ్యమముగను ధ్వనివిహీనమధమముగను నాలంకారికులెంచిరి. ఇందీశతకాదులుకడపటి తెగకుఁజేరిన వౌను. కానిఖండకావ్యములుగా వెలువడినవానిలోఁ గొన్నిట మనోహరరసోల్బణమున కిరవైనవి లేకపోలేదు. అందీకవివతంసుఁడే తొల్లిట మూచూపిన 'యడవిపువ్వులం' గన్నప్పుడే నన్నదిది:

ఉ. నాకిడ మిన్నికంటి గురునాథ కవీంద్రుఁడు వీనువిందుగాఁ
బోకడలొప్పనా 'నడవిపువ్వుల' గుత్తి, నిదెత్తినంత నిం
పై, కమనీయ సౌరభబుధాళిమనోజ్ఞము, ప్రౌఢభావశో
భాకర సత్త్వపీట్టుముద బంధుతనించుసుధామయాఖముల్.

ఉ. శ్రీకవితాలతా నిచయశీతల చారునికుంజపుంజ మాం
జీకృతశింజినీ విజయశింజిత 'మంజరి' మంజులోక్తి శం
బాకృతమాధురీ లలితవాగ్రమణీయతఁ దేనె వాకక
ట్టాఁకలువెట్టఁగా 'నడవి'యందలి 'పూవుల' చంద మొందునో

క. అన్యాపదేశనీతిద విన్యాసము లెల్లఁ జూడవృత్త్యోదాత్త
ధ్వన్యంచితఖండాకృతి కన్యామణి తానఖండగంభీరయిదౌ.

అట్లే ధ్వనికిర వెంతేఁ గల్పించికొన్న "భావలీల" లతో
డిదీ 'సూక్తినిధి'. ఇందుఁ దొలుతటి "నీతిలీల" రెండాశ్వాసము
లలో ముందున్నది పూర్వకవీంద్రప్రాస్తావికశ్లోకములకనువా
దము. వెనుక నిక్కవి తన మదినుదయించిన నానాభావము
లను జతిగించిన దే ద్వితీయము. ఆపైఁగల 'భావలీల' లోని దే
తృతీయాశ్వాసము 'భావశత' కాంధ్రీకరణము. కడపటిది స్వక
పోల కల్పితశృంగారరసమంజరియనఁ దగ్గది. గీర్వాణమున నీవఱకే
'ప్రస్తావస్తబకము' లన నేర్చికూర్చిన వెల్ల హృదయాకర్షకభావ
సముచ్చయము లేయాయె. అనర్గళకవితాధారగలయీయుభయ
భాషాకోవిదు వాక్కునన వెట్టిపొందికంగన్నదియుం బరికింప,
దిఙ్ముఖముగా 'భాగ్యంఫలతిసర్వత్ర నవిద్యానచపౌరుష' మ్మన్న
దానికినిదర్శనముగాఁ 'బాలసందర్భమ్ముఁదర్చ్చెడి కాలమందు

హారుఁడు విష మొందె విష్ణువు సిరిని బొందె' నన్న మాదిరి నే తేట మాటలతో నందఱ కందుబాటుగా నున్న దనుటలో హరిహరస్మరణమైన ముందడుగు వేయుదము.

నీత్యుపపాదక ద్వితీయాశ్వాసగత స్వైరవిహార లీలలో "అమ్మ! విడాకుల చట్టమ! సమ్మతి నీతో ననాథ శరణాలయమున్ రమ్మనవా!" యన్న దానికనతి దూరమున "బూదిపూఁతలు దున్న నిపోట్లయెద్దు వల్లకాఁడిల్లుతో లుదోవతి యటంచు శివుని విడిచి రత్నాకరుఁ జేరెగంగ" యన్న దిహాస్యరసోల్బకమైన మీఁదటఁ "బేదకాఁపురంబంగ నల్వీడిపోరె?' యన్న దివిన్నంత నే యీకొత్తచట్టములు దెచ్చు ముప్పులు దప్పనవొప్పింపఁదగిన ట్లాను గాదే! మఱియు "స్త్రియాశ్చరిత్రం పురుషస్య భాగ్యం దేవా న జానంతి కుతో మనుష్యాః" అనవిన్నప్పటికంటె నిందు 'లక్ష్మి దాతఁ జూచి లబలబలాడును బిసినిఁ జూచి కొసరి కొసరి నవ్వు' నన్న లోకానుభవ ప్రకటనమన లచ్చికేయుంటఁగట్టిన చందము పాఠకులను గొసరి కొసరి నవ్వందగినట్లు కాఁగా' ధనికిఁ గునుకు రాదు తెన్నుకొన్న నన్నంత నే వేమన్న తెన్ను నందించుచున్న దాయె.

మఱి 'భావలీల'లో, తృతీయాశ్వాసగతానువాదములకు దిగునను భావస్ఫోరకతాత్పర్యావబోధ మెక్కడిదక్కడ నెక్కొన్న చందముంగననే నింకనద్దానిని విస్తరింపం బనిలేదు. కడపటిదిస్వతంత్రమాట నద్దానినే పరికింతము: పురాంతదీర్ఘకాజలాహారణ మిషంబున నంజను దివసాభిసారికమున్ముందెదుకౌను. 'లోకులు

నిద్ర లేచుటకు లోపలనే' చననెంచు తమిస్రాభిసారికయు మఱి మూఁడడుగులలోనే తారసిల్లును. ఆ వెనుకం గనవచ్చు నది 'పాన్పు నలుమూలలూరక పట్టితిగుచు 'చే'చీమ చిటుకన్ననటు చూచు' ప్రోషితవాసకసజ్జ కాఁగా, మఱొక్కడుగుననే వినవచ్చునదేదన, 'స్ఫారాబభూవుశ్శ్రమవారిధారాః' అన్నయాబిడ తోఁబుట్టువాయనినట్లు 'దద్దులు గీఱలు స్మరశకతండము సేసెనా!' యంచు వేకువనిలు సేరవచ్చిన పెనిమిటిని బరామరిసించు వక్రోక్తి గర్వితయా మధ్యధీర వాక్కులే కాదా?

ఇట్లాలకించుచుండఁగా, వచోహీనపుఁ బ్రేమలేఖనంపుకొన్న కాంతుఁడు 'ముదంబునువగ ప్రన్వహించి' ఆక్కలు లేమికెంతయుం దలపోయుటంగన నెగిరి విరహిణీకడ్రవాలఁ జూచుట పొడకట్టును. వెను వెంటనే, 'అల్లరియేదియో జరిగెనక్కట! కాంతుఁడు కందిపోయెనే?' యని వగచుచున్నయన్య సంభోగదుఃఖితయా ఖండిత మాటలు గ్రుక్కునఁ జెవి కెక్కును. ఆ ప్రక్కనే యున్న వేఱొక్కత 'తనునయనాంతరాళభీరుః కలయతి మేన విభూషణాని కాంతః' అనుకొన్నదాయన్నట్లు వయస్యునంకమున వెల్గుచు 'వ్రేలుచున్న పలుబన్నసరంబులఁ దీసివైచు' ప్రేమగర్వితక్రీడాసన్నద్ధయా రతిపొడకట్టును. ఆపై నొక్కింత సాగఁగాఁ 'దండ్రికొఱకేడ్వకు నాయన! తల్లితోడ మాటాడికొనంగని" 'మ్మని బిడ్డనినూరార్చు వైఖరింబల్కుచున్న ప్రోషితభర్తృకహృదయోద్వేగము ధ్వనించును.

ఇంకనటుపండినజొన్నచేని దెసదృష్టిసారింపనే 'యొకఁ
డైనఁగాక పలుమూకలువచ్చినవెట్టు?' లంచు 'మన్నుండలు
బాటఁబోవుయునకోత్తముచుట్టుఁబడంగవైచు' టగోచరించును.
వెనుకనిటుచూడ 'సవరించెద వెప్పుడుఁ బైఁటనెందుకే?' యని
మఱఁదలిసరసమాడు వదినెయు, నిట్టిది 'మనవాసన పట్టదె?'
యని తనపెనిమిటితోననుచుఁ 'బైఁటలాగుకొం' చరుగుముగుద
మఱఁదలునుసిద్ధమవుదురు. అటుచెఱువుదరికరుగనే, 'పూలపొద
వెల్వడివచ్చిసరస్తటంబునన్నిలిచిననాతితో' 'నెటనుండి వచ్చి
యోయెలమినిదేనెఁ ద్రావిచనుభృంగ' మటంచనుపల్కులోని
ధ్వనివినవయ్యెడు. అంతమరలుచున్నెడ నొకవాకిటనిల్చిన పర
దేశికునితో 'నీకేయినినన్నపానములఁ బ్రీతినొసంగెదనారగించి
నీవేయెడకేఁ బరుండఁజను' మన్నది. అంతతో మిన్నకుండక
'యింట మఱెవ్వరులేమి' నని వాకొన్నదేకాక 'సుందరా!'
యన్నసంబుద్ధికూడఁ జెవినిసోఁకఁగా నా 'ధ్వని' యొక్కపర
మావధి యంది పోవును.

తలవంచుకొని తుదకిలుదారిఁబట్టఁగా 'గతాబహుతరా
కాంతే! స్వల్పాతిష్ఠతిశర్వరీ'యన్నది స్ఫోరకమానట్టు 'లిఁకన్నగ
ముందురాత్రి'యన్నంతనే యక్కడనాపాంథునకును 'భావము
పొంగిపొరలి' గమ్యమందును. ఈరీతినీకవితావిలాసినితోఁదాను
ఛందోవేషము వేసికొనిమధురపదనృత్యమొనర్చిన యప్పుడురస
స్యందినిగా గమ్యమందుననుటలోనింక సందియమెందులకు? ఇంద

ఉనాయికలతోడి పొందునఁగాక రసమయానందమిం పొందున దింకెందాను? అందులకొ తేఁపమాటలకూర్పులో ఫలసిద్ధింగన, నదిలేనిచోఁ 'గళవళపడుఁ గటకటపడుఁగక్కుర్తిపడు' ననును. 'వేళావేళలులేవా?' యనికోడలి మందలించునత్త యతిప్రాసములను వెదకికొనని సారళ్యమిం కెచ్చోఁగానరాదు? 'వెంటఁబర్వొత్తలేక' 'చుట్టుబలాదూ'రనుమాదిరి లోకోక్తులకిదియిక్క కదా! 'చమురులేనిది వ్వో'కానిదైనను వాడుకపదములకిరవు కల్పింపనే 'సన్నకారు' ప్రయోగమేదైన ననవలె. 'ఒక్కొక' రన్నది యాధునికమహాకవు లవిచ్ఛిన్నముగా వాడిన దేమా. యెను. అందఱికిపుడేసందియముంగొల్పనిదేయైనను గడపటనిం కొక్కటి వివరించియుడుగుదును.

'ఉద్గ్రంథంబును వ్రాయఁగానేటికి? ననుత్తమయశంబు గల్గునాశ్చర్యముగన్' అన్నరీతినే 'వాంఛయున్నదిమదీయకావ్యకన్యలుకీర్తి నాకై గడింప'ననియునీ 'యశః' 'కీర్తి' పదములు సమానార్థకములుగానే యిందుఁబ్రయుక్తములైనవి. 'నసామ్నా శక్యతేకీర్తిర్న సామ్నా శక్యతేయశః' అని పరస్పరవిభిన్నములన్నట్లుప్రాచేతసప్రయోగము. 'సజీవతియశోయస్యకీర్తిర్యస్యసజీవతి అయశోకీర్తిసంయుక్తాజీవన్నపి మృతోపమః' అన్నయభియుక్తోక్తి యీభేదమునుమఱింత స్పష్టపఱుచుచున్నదాయె. కావున 'యశ'మన నెట్టిదో 'కీర్తి'యెట్లుపార్జింపఁదగ్గదో యనిపరికింపఁగా 'యశోదానజాకృతిః కీర్తిర్వీర్యజేతికవి సమయః' అన్నకావ్య

ప్రకాశికారునిచే వివరణముగఁబడును. ఇంకలక్ష్యముల కొలఁకర యుచో, 'లంకానాథం పవనతనయం చోభయం స్థాపయిత్వా కీర్తిస్తంభద్వయమివగిరౌదక్షిణేచోత్తరేచ' యన్న కాళిదాసోక్తియేమి, 'అకృత్వాహేలయాపాదముచ్చైర్మూర్ధసువిద్విషాం కథంకారమనాలంబాకీర్తిర్ద్యా మధిరోహతి' యన్న మాఘకవి ప్రయోగమేమి, 'సువర్ణదండైకసితాతపత్రిత జ్వలత్ప్రతాపావలి కీర్తిమండలః' అన్న నైషధీయమేమి, 'దిక్కూలంకషకీర్తిధౌత వియతోనిర్వ్యాజవీరోద్ధతా' యన్న మురారివాక్యమి లాక్షణి కార్థవివేచనమునకు సాధకములు గానేకన్పట్టెడిని. అదియట్టిదే యైనను యాధునికులెల్లరు భర్తృహరిప్రముఖు లగపఱచిన బాటనేయనుసరించు చున్నారు. అదెట్లనిన, 'ఖడ్గాగ్రైకకరికుంభ కూట దలనైర్నాకంసనీతంయశః' అనియనుటలో యశమును గీర్తిపర్యాయముగాఁ గైకొన నయ్యెను. ఇంకం దానే యశస్సును గీర్తియునార్జింపఁజాలిన శ్రీకృష్ణరాయలేతన విష్ణుచిత్తీయమున 'దానత్యాగపత్రమైతోలుపత్రంబంబు ధారన్సదా నానంద త్సితకీర్తిహంసిచను మింటఁగొ్రత్త నా నేల?' యనుటలోఁగీర్తి పదము నేయశః పర్యాయముగాఁ గొన్నదియుం గందుము. ఇంకిట్టివిమహాకవి ప్రయోగములెన్నేనియుం గానంబడుచుంట నీకవిదనిందిత శబ్దప్రయోగ వైచిత్ర్యంబుగలదిగానే యభిజ్ఞులు గుర్తించుకొలఁకిది యెత్తుకొంటిని.

ఇంకగ్రంథవిస్తర మేమిటికి? ప్రసాదగుణ విశిష్టమైన ప్రకృష్టనవీనమార్గముందొ్రక్కినను, ఖండకావ్యసముచ్చయంబ

య్యైనను, శిష్టులకనిష్టంబింతయుం గాఁగూడనిచక్కని ఫుంతం ద్రొక్కి నీతినిమదికెక్కంజేసిన యీ "సూక్తినిధి" విద్యార్థుల కభ్యసనీయార్థ బోధకముగను విద్వాంసుల కత్యంతానంద సాధకముగను వెలయుచున్నదిగాన సముచిత ప్రచారమునంది లోకతారకమ్మై సుస్థిరంబయ్యెడుఁగావుత!

ఇందలి నీతిని మతిని మున్ముందెక్కించుకొని నానా భావతరంగములం దోలలాడిన వారిలో రసజ్ఞతయందద్వితీయ తకు 'ఏకా' న్వయముసార్థకముగాఁగాఁ గొండంతభారమైన నీనాఁడును గోరంతగా నెంచఁజాలు వదాన్యతా వైశిష్ట్యమున కాంజనేయాభిధానము స్ఫోరకమయిన యిమ్మహాశయుని వలన నిది సర్వరసజ్ఞ లోకానంద సంధాయిని కానౌటెంతయుం బ్రశంసార్హము కాదా?

మ. ధ్వనియున్వ్యంగ్యముమాటమాటకుస్ఫురింపన్భావలీలావినో
దినులౌ నాయికలిందిరాభ పదసంధిన్వీఁడు నందింప, నీ
తిని బెంపొందఁగఁజేయు లీలలసుధాబ్ధిన్వీచికాలోల 'సూ
క్తినిధానం' బిహముంబరంబిడుగుణాప్తిన్సద్యశశ్చంద్రికన్.

బందరు<br>విలంబవత్సరాది

ఇట్లు<br>విద్వద్విధేయుఁడు<br>నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి

# పండితాభిప్రాయములు

కవిసింహ, అవధానిభూషణ, కవితాకళానిధీత్యాది బిరుదాంచితులు
మాఘపురాణ కర్తలునగు బ్రహ్మశ్రీ పోతరాజు లక్ష్మీ నరసింహకవిగారు.

మిత్రమా!

నీవుపంపిన "సూక్తినిధి"యు నాశీస్సులందింపుమన్న లేఖయుఁ జేరినవి.
మజ్జనకుఁడు బ్రహ్మశ్రీ రామకవిగారి దగ్గఱ నాతో సహపాఠివైయున్నప్పటి
నుండియు నీకవితాచతురత నెఱుఁగుదునాయె. మఱియు మీమహాకుటుంబము
లా సేతుశీతాచలము తీర్థయాత్రలు చేయుచో హృషీకేశము, కాశి, మధుర,
రామేశ్వరము, మద్రాసు మున్నగు నెల్లతావుల నీశిష్యులు వ్యాపించియుండి
గురుభక్తిసూపుట ప్రత్యక్షముగాఁ జూచియుంటినాయె. అట్టినీకేమి వ్రాయు
దును? నీ "శ్రీమద్గురు భాగవతము" ఒక్కటిచాలదా నీకీర్తిని జిరస్థాయిగా
నిలుపుటకు. గురుభాగవతము పారలౌకికమైననీ సూక్తినిధియైహలౌకికమగును.
అది యుపనిషత్కులకు నిదిరసికులకు నదివాచ్యముగ నిదివ్యంగ్యముగా
నానందసంధాయకమగును.

మహాత్ములయనుభూతులేగదా వాచ్యములైనపుడు నీతులనంబడు. ప్రథ
మాశ్వాసము మహానుభావుల సూక్తినిధులు. ద్వితీయాశ్వాసము స్వోపజ్ఞము.
కాఁగానిది వర్తమానకాలస్థితిని బూసగ్రుచ్చినట్లు మనోహరవ్యంగ్యమున వెలా
ర్చుచున్నది. ఎట్టివాఁడువిమర్శకుఁడు ఎట్టిఁడుకవి? ప్రజలసాంఘిక నైతికపరి
స్థితులెట్టివి? మున్నగుననేక విషయముల నీ ద్వితీయాశ్వాసముప్రదర్శించు
చున్నది. "ఆట వెలఁదికున్న యంగు దేనికిఁగద్దు. (53పు) వంటిశ్లేషలుముద్దుగా
నున్నవి." చూడుమా రామవైభవస్ఫూర్తి. (98పు) వంటివినోదాభాసము
లెన్నఁదగియున్నవి. "నాటిసంగతులనుమాటికిం గదిపి (100పు)ఇందలివ్యంగ్య
మునకు శబ్దాలంకారముపాలకుఁబంచదారతోడైన ట్లైనది. 'పరలోకముకలదని
"తొలిపలుకులనమ్మక ... (59పు) మున్నగునవి పద్యములో? గద్యములో?
అవి చదువునపుడు తిక్కనస్మృతికివచ్చును. 'పరమాత్ముఁడె.... (61పు
చదువుచో యోగవాసిష్ఠముజ్ఞప్తికివచ్చును. భావలీలలలోని భావవ్యంజకతా
వైఖరి సుమనోహరము. చతుర్థాశ్వాసము శృంగారరసనిధి. "పడమటిగాలి
సోఁకె(104పు) ఇందలి భావసౌరభములు గుబాళించుచున్నవి.

పడఁతీ! నిన్నతగానికై పనిపి నేఁ బాపంబుఁ గావించితిఁ (94పు) ఇందలి అతగానికై అనుపద మెన్ని భావములనో ధ్వనించుచున్నది. నాయికయందలి మానమును దూతియందలి స్వార్థమును బ్రియునియందలి యపరాధమును ముప్పిరిఁ బేనినది. "నిశ్శేషచ్యుత చందనం స్తనతటం నిర్మృష్టరాగో ధరో నేత్రే దూరమనంజనే పులకితా తన్వీ తవేయం తనుః మిథ్యావాదిని దూతి బాంధవ జనస్యాజ్ఞాతపీడాగమే వాపీం స్నాతుమితో గతాసి నపునస్తస్యాధమస్యాంతికమ్" అనుదానిలోని అధమశబ్దముకంటె అతగాఁడనునది యధముఁడను భావమును నిర్లక్ష్యభావమును వ్యంగ్యముగా స్ఫురింపఁజేయుచు మృదువుగానున్నది. పైశ్లోకమందలి దూతి తెలివితక్కువది. (నాయికాదృష్టితో నేయనుకొనుఁడు) మిథ్యావాదిని. బాంధవజనపీడ నెఱుఁగనిది. ఒకటిచెప్ప మఱొకటిచేసినది. ఈ పద్యమందలి దూతియట్టిది కాదు. తెలివిగలది. మిథ్యావాదిని కానిది. బాంధవజన పీడ నెఱిఁగినది. కాననే చెప్పినట్లుచటికిఁబోయినది. అందులకే నాయిక పైకైనను "అయ్యోపాపము. నాకైకష్టపడితివి. నేను నిన్ను గష్టపెట్టి పాపముగావించితి" ననిపల్కినది. నిజమున కాపల్కులు సొల్లుంతనములే. దూతికగుట్టుచక్కఁగాఁదనకోర్కి నెఱవేర్చుకొనివచ్చినది. అయినను నాయిక తన్ముఖాదులంబట్టి గ్రహింపనే గ్రహించినది. కనుకనే అతగానికై పనిపి పాపము చేసి తాపము తెచ్చికొంటినని గూఢముగానీర్ష్యను వెళ్లఁబోసినది. అతఁడేమన్నాఁడని మాటమాత్రమైననడుగలేదు" అడుగుటకంత యోర్పు లేదు. తచ్ఛబ్దమునకు డుజ్ చేర్పక గాఁడు చేర్చి రసపుష్టి కల్గించినది. "మొగమేమొగాఁగనుండె." ననువాక్యమందలి ఏమో పదమిందుకు పోద్బలకముగానున్నది. మొగమునందలి సంభోగచిహ్నములనానవాలుపట్టినది కాననోటితోననలేక నీగుట్టును గని పెట్టితినిలేయన్నట్లుగా "ఏమో. పదము నాయిక యుపయోగించినది.

వక్త్రాదులవలన నర్థవిశేషము వ్యంజకమగును. ఇచట వక్త్రి నాయికయే కాననేయుపభోగవ్యంగ్యార్థమభివ్యక్తమగుచున్నది. చూడుఁడు. దూతిపర్వాత్తిరాలేదు. నెమ్మదిగావచ్చినది. అసురుసురై వచ్చినదిగూడ. దానినాయికయందుకొనినీవెందుకంత పర్వెత్తికష్టపడిరావలయును? ఈలోఁగా నేనువిర

హాగ్ని నిజత్తుననియా? నాపాౘిణాలుఁరక్షింపనా? "పర్వొత్తినది." అనిదూతి చెప్పకున్నను నది చెప్పననిముందుగానే తానని వేసినది. దానినడుసట యది చెప్పట యింతకాలవిలంబనము సహించుస్థితిలోలేదు. కోపమట్లుబడబడ పల్కించినది యామెచే. ఇట్లువాచ్యార్థములు వ్యంగ్యార్థములు నిందెన్నియో యింకనుగలవు. భావకులుభావించిన భావము లెన్నేని ప్రిభవింపఁగలవు ఇచటదిజ్మాౘ్ౘత్రముసూచించితి.ఈభావలీలలోనందును జతుర్థాశ్వాసమునభావ మణులు మిణుకు మిణుకుమనుచుఁజాటుననుండి తొంగిచూచుచు నాంధ్రీ స్తన గతి నానంద మొలికించుచున్నవి.

చం. సకలబుధాళి తృప్తిపడస్వాదు సుధారస మిచ్చుచుంట మూ
ర్ఖకుకవి భీదమౌటసిరిరాజిలు శయ్యయునౌట సూక్తి మా
నికములకిక్క గావుట ధ్వనిప్రథితంబగుచుంట మిన్నికం
టి కవి కవిత్వ మాగురుమనీషులకించుఁబయః పయోధియై.

మ. మృదువై మంజులమై రసాఢ్యమయి యెమ్మెల్ చిమ్ముకావ్యేందిరా
భ్యుదయ మ్మొందఁగఁజేయు మాగురుకవింబ్రోద్యద్గుణా స్థానుని
ర్గదుఁగా దీర్ఘతరాయురుజ్జ్వలుగ భాగ్యశ్రీనికాయ్యుండు గాఁ
బొదలంజేయుత మెప్పుమావిభుఁడు సత్పుత్త్రప్రథాధానుఁడై.

వెంకటగిరి మహారాజ కళాశాల తెలుఁగుపండితులు, విమర్శ కాగ్రేసర బ్రహ్మశ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. నెల్లూరు

తాము దయతో నంపిన సూక్తినిధి అందినది. పనుల యొత్తిడిలో పాత్ర మంతయు పూర్తిగా చదువలేమికి ఖేదపడుచు అందందు చదివి చవిచూచి యానందించితిని. ఈనాఁటి లోకవృత్తమును వెల్లడించుచు నీతినిబోధించుచు శృంగార మొలికించుచు చమత్కార కలిత లలిత రచనలతోను చక్కని వివ రణములతోను మీ యీ నూతన కావ్యము పిన్నలను పెద్దలను గూడ నల రింప వలఁతియై యున్నదనుటలో నతిశయోక్తి లేదు.

తెలుఁగుఁదనపు నిగ్గులతో చల్లఁగా సాగిన మీ కవితా ధారకు నా యభి నందనములు. బహుగ్రంథములు వ్రాసి రుచిర రచనా చాతురి నారితేఱిన

సిద్ధ హస్తులు మీరు. మీపద్యములు హృద్యములని నేనిపుడుచెప్పుట పునరుక్తి. ఈ సూక్తినిధి రసిక ప్రపంచమున నవిరళ విహారము కావించి మీ కీర్తిని విస్తరించుఁ గాక. ఆంజనేయానుగ్రహ పాత్రమగుట మీ కృతికి సర్వత్ర జయము చేయఁగలదు.

సరసకవి, సాహిత్యరత్న, బ్రహ్మశ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు. నెల్లూరు

విద్వత్కవి తల్లజులైన శ్రీమిన్నికంటి గురునాథశర్మగారి సూక్తినిధియధు నాతనాంధ్ర వాగ్దేవికొక యభినవ కర్ణావతంసము. అందలి ద్వితీయ తురీ యాశ్వాసములు ప్రత్యేకముగా నాహృదయము నాకర్షించినవి. సులభముగా సూటిగా మదికెక్కు సత్యములు నీతులు రీతులు నేఁటి సాంఘిక వ్యవస్థలో గోచరించు పద్ధతులు సార్వకాలిక మానవ చిత్తవృత్తులు శ్రీ గురునాథశర్మ గారి హృద్యపద్యములలోఁ జక్కఁగాఁ జిక్కఁగా నిముడ్పఁబడి చదువరులకు గిలిగింతలు కల్పించుచున్నవి.

సూక్తినిధిలో సురుచిర భావములు పొంగిపొరలి ఛందోవేషము వేసికొని మధుర పద నృత్యము చేయుచున్న వనుట యథార్థ కథనము. భగవంతుఁడు దీర్ఘాయురభ్యుదయము లీకవికితోధికముగా ననుగ్రహించి లోక కల్యాణ సంధాయకములైన కృతులు ఇంకను ఈమహాశయుఁడు రచించి ప్రకటించుట కానుకూల్యములు కలిగించుఁగాతమని సంప్రార్థించు చున్నాను

సుప్రసిద్ధ మహాకవులు బ్రహ్మశ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు

... ... ... ...

మీ సూక్తినిధి ఆద్యంతము చూచాను. నీతిలీల భావలీల అనే రెండు భాగాలలోను మొదట సంస్కృత కవుల సూక్తులను తెనిగించి పిమ్మట తత్తుల్యంగా మీరు స్వతంత్రరచన చేసిచూపుట ఎంతైనా ముచ్చటగా ఉంది. గురు భాగవతమందలి మీ అడకువా సూక్తినిధియందలి మీ అడకువతోడి గడుసుదనమూ ఒకదాని నొకటిమించి సహృదయులను అలరిస్తున్నవి. నా సంతోషాన్ని ఇలా ప్రకటించానే కాని నిజానికి మీ వంటి మహాకవుల రచనలనుగూర్చి అభిప్రాయం చెప్పగలవాడను కాను.

శ్రీరస్తు

# సూక్తినిధి

## నీతిలీల

### ప్రథమాశ్వాసము

కం. శ్రీలను వినయ వివేక
శ్రీలను మేలైనమాటఁ జెవిఁజేర్చి వినం
జాలు సుగుణముల నొసఁగి ద
యా లీలం బ్రజలఁ బ్రోవు హరిహరనాథా.

ఆ. ఏదొ చెప్పువార లెల్లెడ నుందురు
హితము చెప్పువారలే కొఱంత
ఆలకించు వార లంతకంటెఁ గొఱంత
చేయు వారి నింకఁ జెప్పవలెనె?

§ ఆ. ఆంధ్రదేశజుండ వాంధ్రిత్వమలవడె
నందు శాఖగూడ యాజుషంబె
ఆంధ్రభాష మాటలాడుచుండెద వెంత
గొప్ప తపము చేసికొంటి వొక్కొ?

---

§ ద్రావిడులగు నప్పయ్యదీక్షితుల వారి యాశయము.

తే. అన్నదాన వ్రతమ్ము జోడెన్న లేదు
మహితగాయత్రిమించిన మనువులేదు
తల్లికంటె నుత్తమ దైవతంబు లేదు
ద్వాదశీ సమంబగు తిథి ధాత్రి లేదు.

తే. అమల గోక్షీరమును దినాంతమునఁ ద్రావఁ
దామ్రపాత్రోదకము నిశాంతమునఁ ద్రావఁ
దక్రసారము భోజనాంతమునఁ ద్రావ
మనకు వైద్యునితోఁ బ్రయోజనము సున్న.

తే. ఇతర పాప ఫలమ్ము లెన్నైన వ్రాయు
స్వేచ్ఛ మెయిఁ జతురాననా! యే సహింతుఁ
గాని యరసికాళికిఁ గవితా నివేద
నమ్ము వ్రాయకు వ్రాయకు నా మొగాన.

ఆ. త్వాదృశుండవగుము దానముల్ సేయుచు
నీక మాదృశుఁడవు గాకు మనుచుఁ
గఱపఁ గాని తిరియఁ గాదు భిక్షువు గేస్తు
గడప గడప నెక్కి కష్టపడుట.

తే. కఱవునందు నమిత్ర సంగరము నందు
మసన మందు మహోగ్రదుర్వ్యసనమందు
ధరణి ధవుద్వారమందు నుత్సవమునందుఁ
దోడునిల్చిన వాఁడె బంధువు గదయ్య!

తే. డిందును విశాఖతో నభ్రబృంద మహిమ
విడుచు యౌవనంబు ప్రసూతి గడచునంతఁ
దెరలు గౌరవం బన్యుల దేహియనఁగఁ
గలుగు రాజ్యాంతమున నరకమ్ము నిజము.

కం. తిల లిక్షుదండములు కాం
తలు క్షుద్రిలు చందనమ్ము తాంబూలము భూ
ములు దధి బంగారమ్ము మి
గుల మర్దనమున వహించు గుణవర్ధనముల్.

తే. స్వాంతమున సల్పినదియె పాపంబు గాని
కాయకృతము పాపంబది కాదు కాదు
ఆత్మదారఁ బరీరంభ మాచరించు
కరములే గాదె కూఁతును గౌఁగిలించు.

కం. ధనముంగోరెద రధములు
ధన మానంబులను గోరెదరు మధ్యము లా
త్మను మాన ముత్తముఁడు గో
రును. మానమెగాదె సత్పురుషులకు ధనముల్.

కం. నీరక్షీర వివేచన
సార మెఱుఁగు మత్స్యముఖ్య జలచరములు. కా
నీ రాయంచల కేయా
కీరితి దక్కెను. సుకృతముతె కీర్తి నొసంగుల్.

తే. జనన మన్నంబు మరణంబు ధనము పెండ్లి
యెచట జరుగంగ వలయునో యచటికే బ
లాత్కృతిని ద్రాడు మెడఁగట్టి లాగఁ బడుచుఁ
జన్న చందమ్మునం బోవు నన్నరుండు.

చం. అరరె! దరిద్రుఁజూచి యపహాస్యముసేసెద వేధనాంధుఁడా!
స్థిరమటరా భవద్ధనము ? చెప్పక వచ్చెను జెప్పకుండ నే
యరుగు. దరిద్రతా ధనికతావధి యెవ్వఁ డెఱుంగు. నీటిచే
భరితమురిక్తమౌచున దెవర్తిలుఁజూడుము మోటబొక్కెనన్

తే. కర్మమొక్కండె మివుల ముఖ్యమ్ము సుమ్మ
బయల గల శుభగ్రహము లేమి యొనరించుఁ
బట్టముం గట్ట లగ్నమ్ము పెట్టె మౌని
మెట్టనేలరా దశరథుపట్టి వనము.

తే. విప్రవరులు శ్రుతిస్మృతి విహిత విధుల
నాచరింపరెం, దుత్తరీయంబు కొఱకు
మూఁడు, నాల్గు వస్త్రాభావమునకుఁ గాను
జందెములను ధరించుచు నుందురయ్య !

తే. వలువతో నేమిలే యంచుఁ దలఁపరాదు
యోగ్యతకుఁ బ్రధానమ్ము వస్త్రోత్తమమ్మె.
వనధి పీతాంబరుని గాంచి తనయనిచ్చె
నా దిగంబరుంగని హాలాహలము నిచ్చె.

తే. వేశ్యలకును సద్భావంబు వెలయఁ బోదు
సంపదలకు స్థిరత్వంబు జరుగఁ బోదు
మూర్ఖులకును వివేకంబు పొదలఁ బోదు
కర్మములకు వినాశంబు గలుగఁ బోదు.

కం. దూరపుఁ గొండలు, వేశ్యా
నారీజనతాస్య మండన వితానమ్ముల్
ఘోరతర యుద్ధ వార్తలు
దూరమునకె రమ్యములుగఁ దోఁచుచునుండున్

తే. తెలివిగలిగి యైదారు రోజులు వసించె
నేని శ్వశురాలయము స్వర్గమే నిజంబు
నేయి పెరుగుల కాసించి నెల వసించె
నేని నిర్లజ్జుఁడై మానహాని యొదవు.

కం. ప్రాతఃకాల స్నానము
మాతాపితృ పూజనంబు మహితో ధ్యాన
వ్రాతంబుల్ గోసేవ సు
మాతతవాటి సుఖవిద్య లబ్బుట కొఱకా.

కం. గురుఁడాత్మ వంతులను, భూ
వరుఁడు దురాత్ములను, గూఢ పథమునఁ బాపా
చరణులయి తిరుగు దుష్టా
త్మ్కరమున్ వైవస్వతుండు దగ శాసించున్.

కం. అలవోకగ సత్పురుషులు
పలికినను శిలాక్షరముగ భాసిలు నదియున్
ఖలులు శపథం బొనర్చుచుఁ
బలికినను జలాక్షరముగ భాసిలు నదియున్.

కం. ఎమ్మనుజుఁ డిలఁ బడిన లే
లెమ్మనుమా నీకు నావులింతయు రా నా
స్యమ్మెదుటఁ జిటిక వేయుము
తుమ్మిన దీర్ఘాయు వనుము దోష మనని చోన్.

కం. పలుకుము శుభంబు మఱియుం
బలుకుము ప్రియ మింకఁ బలుకు మంచి దెయనుచున్
ఫల రహితమగు వివాదము
కలహము పెట్టుకొన రాదుగా యెవ్వరితోన్.

తే. ఎల్లయెడల ఫలించు నదృష్ట మొకటె
కాదు విద్య పౌరుషమును గాదు గాదు
పాల సంద్రమ్ము ద్రచ్చెడు కాలమందు
హరుఁడు విషమొందె విష్ణువు సిరిని బొందె.

సీ. తానలందుకొను చందన, మాత్మసంస్తుతి
తాఁగట్టుకొన్న పూదండ తాల్పు
సానగందపుఁబూఁత జలములఁదనరూపుఁ
గనుట, నాపితయింట క్షౌరకర్మ,

మజముల ఖరముల యంఘ్రులధూళి, స
మ్మార్జనీభవరజో మండలమ్ము
దీప మంచకము లొందించు క్రీనీడలు
పగటి వెలగనీడ పరునిభార్య

పరుని వస్త్రంబు పరశయ్య పసనికూడు
పరగృహో వాసమును ధాన్య మజక పాద
ములను దొక్కుట రేయిరావులయు నీడ
శత్రు సంపదనే వినాశంబొనర్చు.

పరునిన్గాంచి కపోతి యిట్లనియె దేవా? యంత్యాకాలమ్ము దా
పరమయ్యెన్మనకిప్డువ్యాధుఁడయయో బాణమ్ముసంధించెఁ బైఁ
బరఁగెన్ డేగ, యటంచుఁ బల్కునెడ నవ్వాఁడీగ్లై సర్పంబుచే
ధరబాణాహతి డేగగూలె, విధిచేఁతల్ చూడఁగాఁ జిత్రముల్.

తే. న్యాయమును వీడి సంపాదనం బొనర్చు
ధనము పదికాలముల పాటు దనరుటయును
గష్ట, మావల నిలువదు క్షణముగూడ
నదియు, దొంటిధనముఁ గొంచు నరుగుఁ జూవె.

తే. మక్షికలు గూడఁబెట్టిన మధువు, లుబ్ధ
జనము మూటలుగట్టిన ధనము, చీమ
దండు రాసులు వోసిన ధాన్యమును, స
మూలముగనే వినాశంబుఁ బొందుచుండు.

తే. పరిణయములందు, దేశవిప్లవములందు
యాత్రలందు, సత్తీర్థంబులందు, ఘోర
సమరములయందు, గ్రామదాహములయందు
నంటు దోషంబు లేదని యార్యులండ్రు.

కం. కొరడా వ్రేటు సహింపవు
శరశత పాతము సహించు జాత్యశ్వంబుల్
పరిభవలవ మోర్వరు దు
ష్కరము విపచ్ఛతము నోర్వఁగల రభిమానుల్.

కం. తురగారూఢుఁడగు యతీ
శ్వరు, మంచాసీనయగు రజస్వల, శీర్షో
పరిఁగేశములున్న విధవ
నరసి సచేలముగఁ జేయనగు స్నానమ్ముల్.

తే. ఓడయందును శాత్రవ పీడయందు
గోటయందు మహాయజ్ఞ వాటియందు
గారయందును ఘోరాంధకారమందు
నంటుదోషంబు లేదని యార్యులండ్రు.

కం. వనరుటచే విత్తము, క్ర
న్ననఁ జదువుటచేత విద్య, నవ్వులచేఁ గా
మిని, విడుపులచేఁ గీరితి
తనకున్నశమాట కడు యథార్థము సుమ్మా.

కం. నవ్వుచు దుష్కృత్యంబుల
నెవ్వాఁడయిన సలిపి యవల నేడ్చుచుఁగుడుచుం
జువ్వో శుభాశుభకర్మము
లెవ్విధి భోగ్యములు గాక యేగు? స్వకృతముల్.

కం. కలహాంతమ్ములు హార్మ్య
మ్ములు, కువచోంతములు స్నేహపుంజమ్ములు, కీ
ర్తులు బహు దుష్కార్మాంత
మ్ములు, కున్నృపాంతములు రాష్ట్రములు మనుజులకున్.

కం. లాలనమువలన బహు దో
షాలున్, దాడనమువలన సమ్యగ్గుణపుం
జాలుం గలుగుం గావున
లాలింపఁగ రాదు శిష్యులను బుత్త్రికులన్.

కం. ఎంతవఱకు దేహీ యనుచు
గొంతెత్తెడొ యంతవఱకె గురుత దనరు శ్రీ
కాంతుఁడును దిరియఁగా బలి
చెంతఁబడిన త్రిప్పలెల్లఁ జెప్పఁగ వలెనే?

కం. ఇచ్చును మఱి పుచ్చుకొనున్
గ్రుచ్చియడుగుఁ దానుదెల్పు గుహ్యావిషయముల్
నిచ్చలు పెట్టు భుజించున్
సచ్చరితా! యివ్వి ప్రీతి షల్లక్షణముల్.

కం. తినుచు నడువ, నవ్వుచు వా
గను, మేలును విస్మరింప, గతమునకై యే
డ్వను, జతలో మూఁడవ వాఁ
డనుగాఁజన, నన్ను మూర్ఖుఁడా! యన నేలా?

కం. ధనము, గృహచ్ఛిద్రము, మం
త్రనిరూఢియు, నాయు వౌషధమ్ము రహస్యం
బును దానమ్ము పరాభవ
మును దప మివి గోప్యములుగఁ బొదలుట యొప్పున్.

కం. శూరు లఖిల శాస్త్రకళా
పారంగతు లౌరులఁ గొలుచు నగ లెఱిఁగిన య
వ్వారలు సువర్ణపుష్పిత
ధారణినే కాంచుచుండెదరు సంతతమున్.

తే. గురువులు సమక్షమున, మిత్రకోటి బాంధ
వులు పరోక్షమునన్, వరవృళ్లు కార్య
మైన వెనుక, మృతింగన్న యువల స్త్రీలు
పొగడఁదగుదురు పుత్త్రులెప్పుడును దగరు.

తే. మందు మ్రాఁకులు సేవింపకుండుగాక
పథ్యముగ నున్నఁజాలును వ్యాధి కుదురు
పథ్యమొక్కింతయేఁ బట్టువఱుప వేని
యెన్ని వందల మందులు నేమిసేయు?

తే. గజమువలె స్నానమొనరింపఁ గడఁగవలయు
నజమువలెఁ జర్వణంబు సేయంగవలయు
బకమువలె ధ్యానమును సలుపంగవలయు
శుకమువలెఁ బలుకాడంగఁ జూడవలయు.

తే. అముని గ్రంథరచనము సేయంగలేఁడు
జారగాని యంగన నాథుఁ జంపఁబోదు
జనకు ద్వేషింపఁజాలఁ డజారజుండు
పృథివికిని భర్తగాలేఁ డవిష్ణు వెప్పుడు.

కం. సమయోచితముగ నను వా
క్యము గుణగణ రహితమైనఁ గడు నాత్మకు మో
దమునె గలిగించు రతి సమ
యమున సతి పౌనర్భ్వ కూజితారవమువలెన్.

తే. ఉష్ట్రసంతతి పాణి పీడోత్సవముల
రాసభంబులు సంగీతరవము నాల
పించె నపుడొండొరుల్ ప్రశంసించుకొనిరి
బళిరె స్వరమంచు బళిరె రూపంబటంచు.

కం. మానవున కెవ్వనికి నభి
మాన ధనంబుండు వాని మనికి చిరంబౌ
మాన విహీనుని యాయువు
గాని ధనముగాని మిగులఁ గ్రాలిన నేమీ?

కం. అతిమేధావికి ననప
త్యతయో దారిద్ర్యభరమొ యల్పాయు స్సం
స్థితియో యొకం డవశ్యం
బతికి కొనుంజువ్వొ సంశయము లేదిందున్.

కం. నాలుగు విధములు పురుషా
ర్థా, లందొక్కండుగూడఁ గ్రాలదెవని క
ప్పాలను పుట్టువు దేని ? క
జాళి గళస్తనమువోలె వ్యర్థముగాదే ?

తే. మంచితిథి తార లరయఁ దలంచుటేల ?
క్షౌరము బుధేందు వారాల సమ్మతంబు
యుక్తతిథి తార లరసియే నొగ్గకయ్య
క్షౌరమునకు శన్యంగార వారములను.

తే. పుత్త్రజీవనకాము లెప్పుడును గూడ
క్షౌరమున కొప్పరఁట సోమవారమందు
వారు బుధశుక్రవారాలు పరమసమ్మ
తమ్ములంద్రు నిషిద్ధదినమ్ము లైన.

ఆ. ఎవనిపని యొనర్ప నిష్టంబు లేదొ వా
రల కొసంగు నుత్తరంబ దేది ?
మాపు మఱల రేపు మాపు మఱల రేపు
మాపు రేపు రేపు రేపు రేపు.

చం. తరుణి నిజాంక పీఠమునఁ దాల్చిన మాటికి రక్షణీయమే
పరిచితుఁడైనను న్ధరణి పాలుఁడు సారెకు సేవనీయుఁడే
యెఱిఁగిన నేమి శాస్త్రచయ మెల్లపుడుం బరిచింత నీయమే
తరుణిన్నృపుండు శాస్త్రముసదాసుకరమ్ముగలోనుగారయా.

ఆ. మూఁడు వత్సరముల మూఁడుమాసంబుల
మూఁడు పక్షములను మూఁడు దినము
ల న్నరుండు భూతలమున నత్యుత్కటా
వార్య పుణ్య పాప ఫలము గుడుచు.

కం. గురుఁడుత్తముండు, భృగుభా
స్కరులు న్మధ్యములు, భౌమశనులు కనిష్ఠుల్
మఱిబుధ సోములు తగ రె
త్తఱి విద్యారంభమునకుఁ దలకొను నెడలన్.

కం. తొలి బ్రహ్మదేవుఁడు నవాం
గుళ ప్రమాణముగఁ గీలుకొలిపె నఖల వ
ర్ణులకుం గలంబు మఱికా
వలెనని యధికంబు సేయ ఫలమ్ము నధికమే.

కం. తరుణిది పెత్తనమైనన్
ధరణీశుఁడు బాలుఁడైనఁ దన్మంత్రి నిర
క్షరుఁడైన నట ధనాశం
దొరఁగుము మఱి జీవితాశ దుర్లభ మగురా.

కం. తరుణుల చాచులు వలెనే
పరస్పర విలగ్నములును వర్తులములు సుం
దరములు సమములు ఘన వి
స్ఫురణములై యక్షరములు శోభిల వలయున్.

తే. అస్మదీయాక్షర ప్రజ్ఞ నరయవయ్యె
పై పటాటోపములతోడఁ బనియ దేమి?
వస్త్రహీనుండు శివుఁడు సర్వజ్ఞుఁడయ్యె
పీతవసనున కాపాటి పేరు లేదు.

కం. తమి మిథునకర్మ ముద్యో
గము నాహారమ్ము నిద్ర కండూతి వివా
దము పరసతీ సుఖము మ
ద్యము జూదము సేవనమున నభివర్ధిల్లున్.

కం. కూరాకును రాద నమ
స్కార సహస్రములవలన, సరిసరి భవదా
శీరావ సహస్రమ్ముల
చే రోమముగూడ వృద్ధి సెందద నాకున్.

కం. ఇంగితముల నాకారము
లం గతులం జేష్టితమ్ముల న్నయన భ్రూ
భంగ వికారముల న్నుడు
లం గైకొనవచ్చు నన్యుల మనోగతమున్.

కం. చతురతరుం డాకార
స్థితిఁగని యూహించుఁ దనదుచిత్తమునఁ బరేం
గితముం గంధముచే గ
ర్భితకైతక పుష్పమున్ ద్విరేఫము వోలెన్.

తే. భగవదర్చనముల శాస్త్రవచనములను
బుద్ధిమంతులకును బ్రొద్దుపోవుచుండు
జూదములను నిద్రలను వివాదములను
మూర్ఖులకు దివారాత్రముల్ పోవుచుండు.

ఆ. కోరితాను జేసికొన్న శుభాశుభ
కర్మఫలముఁ గుడువఁ గావలయును
దప్పదెప్పు డది వృథాగ నశింపదు
కల్పకోటి శతము గడచుఁగాక.

కం. ఇతఁడన్యుండనుచును, మఱి
యితఁడాత్మీయుండటంచు నెంచును లఘుధీ
ప్రతతి యుదారాశయులో
క్షితినే స్వకుటుంబమంచుఁ జింతింతురెదన్.

కం. ద్యూత ప్రసంగ ముదయము
నాతి ప్రసంగంబు పగటి నడికాలమునన్
రాతిరి చోరు ప్రసంగం
బీతీరునఁ బ్రొద్దుపుత్తు రీద్యచరిత్రుల్.

తే. ఎచట నాత్మీయ జనముండ దచట భేద
మునకుఁ దావులేదని తలపోయవలయుఁ
దరువునఱకంగ నోపునే? దండ ముక్త
మౌ కఠోరకుఠార మేపీకనైన.

తే. క్రోధముఖి యగుభార్య మూర్ఖుఁడగు కొడుకు
విధవయగు కన్నకూఁతురు నధమసేవ
స్వల్పభుక్తి కుగ్రామవాస మివి తనదు
కాయమును నిప్పులేకుండఁ గాల్చివైచు.

తే. పెద్దతికము గుణమ్ముల వెలయుఁగాని
ముందుఁబుట్టిన కారణంబున నె రాదు
ప్రకట కేతకి జ్యేష్ఠపత్రములకన్నఁ
గన్నెఱేకులకేగదా గౌరవంబు.

కం. క్రిందంజూచుచు నుంటివె
యిందుముఖీ! నీదువస్తు వేది పడియె? నో
మందమతీ! యెఱుఁగవ యిం
కం దారుణ్యా నవమౌక్తికము పడిపోయెన్.

కం. ధనమును విద్యను వంశం
బును నాయువు మృతిని గర్భమున దేహి వసిం
చిననాఁడె యేర్పఱచి యుం
చెను స్రష్ట యశేష శేముషీ విలసితుఁడై.

కం. గృహమును గృహమన రాదుర
గృహిణిని గృహమంచుఁ జెప్పెదే నుచితముగున్
గృహిణి వెలుంగని గృహమది
గహనమొ! గాఢాంధతమమొ! కాడో! బీడో!

కం. గతము స్మరింపఁదగ, దనా
గతమును జింతించు టసలె కాని పని, లస
న్మతులార! వర్తమాన
స్థితిఁగని యవసరపుఁ బనులు చేసికొనుండా!

కం. చదువు గృహాసక్తుని జే
రదు దయ మాంసాశిఁ గవయరాదు పవిత్ర
త్వదశయు స్త్రైణమ్మును డా
యదు సత్యము ద్రవ్యలుబ్ధు నంటదు వింటే.

తే. గుణిని జేరి గుణజ్ఞుండు కుతుకమందు
నవగుణుఁడు గుణిం జూచుటకైనఁ బోఁడు
అడవినుండి తమ్మిం జేరి యలరు భృంగ
మేకవాసమైనను గప్ప యేగదెపుడు.

తే. శిష్య విత్తాపహారకుల్ చిక్కుచుందు
రెందరెందఱో గురులు మహీతలమున
శిష్యహృత్తాపహారుఁడు శ్రేష్ఠుఁడైన
గురుఁడు దుర్లభుం డవని నొక్కరుఁడు గూడ.

కం. భాసుర గుణములచేత
న్వాసింగను నున్న తాసనస్థితిఁ గా దా
ప్రాసాదాగ్రస్థంబై
గాసింబడుఁగాక కాకి ఖగపతి యగు నే?

కం. ధనియయ్యునముద్రుఁడును, గుణ
ఖనియయ్యున్ దీర్ఘజీవి, కాంత చతురయ
య్యును శీలవతి, ముకుందుని
ఘనభక్తుండయ్యు విత్తకలితుఁడు గలరే?

తే. తెల్లజిల్లేడు పువ్వులు చల్ల శివుఁడు
నూలుపోగు నర్పింపఁ జంద్రుండు, స్మరణ
మాత్రమున నచ్యుతుండు, నమ్రతను హస్త
సంపుటమొనర్ప సాధులు సంతసింతురు.

తే. మూర్ఖులకు బోధకుండు, లుబ్ధులకు యాచ
కుండు, జారకాంతలకు విభుండు, చోరు
లకును జంద్రుం, డజీర్ణార్తులకును గూడు
పరమశత్రువు లివ్వసుంధర నిజంబు.

తే. దేహపోషణంబునఁ దల్లి దీటు నాస్తి
దేహభూషణంబున విద్దె దీటు నాస్తి
దేహతోషణంబున నాలు దీటు నాస్తి
దేహశోషణంబున వంత దీటు నాస్తి.

తే. రుచిని బక్వంబును క్షుధాతురులు గ్రహింప
రులుకు సిగ్గును గామాతురులు వహింప
రెలమిఁ గూరుకుఁ జింతాతురులు ధరింప
రరయ రోజ్జఁ జుట్టము ధనాతురు లెడంద.

కం. అల్లుండు కోడెత్రాఁచుం
గల్లరి వైశ్వానరుండు కడకుం దనమే
నల్లుం డీయెదుగురం
జెల్లదఁట గదయ్య విశ్వసింప నెడందన్.

కం. మతినాలుక పయిని నిలిపి
మితముగ భాషింపుమి మఱి మితముగఁ దినుమీ
అతిభోజన మతివాచా
లత యప్పటి కప్పు డసువులం గొనఁ జాలున్.

కం. తొలిమినుకులు కాలాంతర
ములు, నొకనెలలోఁ బురాణములు, సంగీతం
బులు నప్పుడ యొసఁగు ఫలం
బుల, జ్యోతి ర్వైద్యశాస్త్రములో యెల్లపుడున్.

కం. జలదవిషయమై జ్యోతిష,
మలఘ్వాశనునందు యోగ, మాసవరస పా
యుల యందున్ జ్ఞానము, శ్వా
సులయందును వైద్యకంబు చూడఁగ మిథ్యల్.

తే. గుడ్డిమగనిపైఁ బ్రసరించి కులుకులాఁడి
కలికి క్రేగంటి చూడ్కుల ములుకుగములు
నిష్ఫలములగు రాత్రుల నీరజాప్త
మందకుజవార దోషాల చందమునను.

తే. ఏరికే గుణంబులు పొలుపారుచుండు
నవి తమకుఁదామె వికసన మందుచుండు
కమ్మకస్తురి తావులు చిమ్ముచుండఁ
దరమె? యెవ్వారికే నడ్డుదవిలి యణఁప.

ఆ. కాదు వేలుపులకుఁ గాదు ధర్మములకుఁ
గాదు చుట్టములకుఁ గాదు యాచ
కులకుఁ గూడఁబెట్టుకొన్న లోభిధనమ్ము
ఱేనిపాలో ? దొంగవానిపాలో ?

తే. ప్రథమమున విద్యలను గడింపంగ లేదు
రిక్థము ద్వితీయమున సమార్జింపలే దు
తపమును దృతీయమునను బొందంగ లేదిఁ
కేమొనర్తు చతుర్థమందీవు సఖుఁడ !

తే. తనయుకంటె నుత్తమలాభ మెనయఁబోదు
భార్యకంటెఁ బరసుఖంబు వరలఁబోదు
ధర్మమునకంటెఁ బరమమిత్రంబు లేదు
దబ్బఱనుమించి ఘోరపాతకము లేదు.

కం. తొలిచదువుల వలన బుధేం
ద్రులు, గంధమువలనఁబశుతతుల్, వేఁగుల వా
రలవలన నృపులు, తమ క
న్నుల వలనంబరజనము కనుంగొనుచుంటల్

తే. ధాన్యమిడుపొలా, ల్మిత్రులుత్తములు, సేవ
కాళులాజ్ఞాపరులు, మనోహారిణి సతి
బుద్ధిమంతులు సుతు, లిష్టభోజనమ్ము
లతిథిపూజలౌరా ! గృహస్థాశ్రమమ్ము.

తే. వాచికాఘమ్ముచేఁ బశు పక్షి జన్మ
స్వాంత పాపమ్ముచే నంత్యజాతి జన్మ
స్వతనుకృతమగు కర్మదోషమ్ముచేత
స్థావరత్వంబు నరునకు సంభవించు.

కం. ద్వారములేనిది కూపము
ద్వారమొకటికలది వాపి నైకద్వారా
ధారము పుష్కరణి, తటిం
బాటెడి కాలువలు గలది పద్మాకరమా.

కం. ఉఱుములు స్త్రీ చిత్తమ్ములు
పురుషుల భాగ్యములు తురగములప్లుత ధారల్
మెఱుములు వర్షము లెప్పుడు
వరలునో యెఱుఁగంగలేఁడు భగవంతుండున్.

కం. లలితోద్యానముల జలం
బుల మేడల క్షీరపానములఁ గల్కి కవుం
గిళులన్ బీరెండల ఋతు
వులారిటం గలుగు సుఖము వొందఁగవచ్చున్.

తే. త్వక్కఫలోదర రోమ సంభవములగుచుఁ
దనరుచుండెడి వస్త్రభేదంబు లవ్వి
ప్రోక్షణంబున క్షాలనంబున సమీర
ణంబున విశుద్ధమౌను క్షణంబులోన.

తే. ఊర్ణ వాతంబుచే శుద్ధి నొందుఁగాని
శవమునైన రజస్వలా యువతినైన
మలమునైన వీర్యమునైన మనుజమూత్ర
మైనఁ దాఁకినప్పుడు శుద్ధ మగుట కల్ల.

కం. పవన మ్మీశ్వర నిర్మా
ల్యము నుచ్ఛిష్టమ్ము శవగతాంబరముం గా
కమలోద్భవ మీయైదున్
విమలము లతిపూతము లని విబుధాశయముల్.

(తేనె-గంగ-ఆవుపాలు-పట్టు-రావిచెట్టు)

# నీతిలీల

## ద్వితీయాశ్వాసము

తే. భిన్నభిన్న దృక్పథములీ విశ్వమందు
నుండ కేమగునంచు నీయుక్తులఁగని
తమబుజంబులు తమ చేతఁదడవికొనుచుఁ
గనలుదురొ ? నవ్వుకొందురో ? జనులుమాతు.

తే. ఎవనికడఁ గవితాకళ లింపుగులుకు
నతఁడుసామాన్యుఁడని మాత్రమనుకొనకుము
గీఁత లేక యుద్గ్రంథముల్ గీయఁడాయెఁ
బుణ్యముండక పేరును మోయఁడాయె.

తే. ఎందుకోయి నీపాండిత్య ? మెందుకోయి
శాస్త్రపరిచయ ? మెందుకు శబ్దశుద్ధి ?
పదుగు రభిమానులున్నఁ జాలదె ? యనూన
గౌరవంబుల న్నెన్నెనఁగాంచవచ్చు.

తే. గద్యరచనలె సేయుచుఁ బద్యరచన
సేయలేకున్న నేమిరా ? చెంతయింత
యాధిపత్యబలంబున్న నం తెచాలు
వానినయ్యదె కవి చక్రవర్తియనును.

ఆ. కవితయందుమార్పు కావ్యమందునుమార్పు
వస్తువందుమార్పు భాషమార్పు
పద్యమందుమార్పు భావమందునుమార్పు
ఇరువదవశతాబ్ది యెంతమార్పు.

ఆ కొడుకు పగిదిఁజూచుకొనుచు బోధించిన
గురువుపేరు చెప్పికొనఁ డొకండు
ఒక్కముక్క చెప్పకున్నఁ బ్రసిద్ధుని
గురుఁడటంచుఁ జెప్పుకొను నొకండు.

ఆ. ఒక్కఁడేదియన్నఁ దక్కినలోకమ్మ
నంతెయంతె యనుచు వంతపాడు
నదిగొపులియటన్న నదిగొతోఁకయనును
దిగి విమర్శ చేయఁ దివురదకట!

ఆ. పేరుదెసలకెక్క భోరునమ్రోఁగెడి
వఱకె మిగులఁ గష్టపడవలయును
అవలనెట్టులెన్ని యాటలాడిననేమి?
పొక్కబోఁక సమసిపోవుచుండు.

కం. యతులుంబ్రాసలు కుదరవ!
యితివృత్తము లేద! బాసయిచ్ఛకొలఁది శు
ద్ధత నొందుగద! తమ్ముఁడ! నీ
కృతులకొఱకు నెవ్వరేడ్చిరి మహాంధ్రమునన్.

కం. పండితులకావ్యముల కొక
దండము పెఱలే యిసుళ్ళదండుగ వెడలెన్
రెండవ పరి చదువుట కె
న్నండైనను నోచుకొనియెనా యందొకఁడున్.

తే. బళిరె! సుకృతులకుంగూడఁ బక్షపాత
మున్న నేమన్న నేమి ప్రయోజనమ్ము?
బ్రదికియుండఁగొందఱకును వాసిఁగూర్చుఁ
బ్రాణమెడలఁగొందఱకును వాసిఁగూర్చు.

కం. తనచట్టులో తనచుట్టలో
తనపట్టులో యున్నఁజాలుఁ దా నుద్గ్రంథం
బును వ్రాయంగా నేటికి
ననుత్తమ యశంబుగల్గు నాశ్చర్యముగన్.

తే. 'ఉత్తమమ్ స్వార్జిత' మ్మని యొత్తియొత్తి
పలుకుదురుగాక నీతివేత్త లదియెల్ల
నాకుమాత్రము వాంఛయున్నది మదీయ
కావ్య కన్యలు కీర్తి నాకై గడింప.

ఆ. భట్టుమూర్తి పాతిపెట్టిన బీజమ్ము
మొలకలెత్తి పంటలొలుకఁబోసె
నేఁడు కల్పితమ్ము నిజమైనచరితమ్ము
ఋతము దెలియ వేర్పరింపలేము.

తే. పూర్వకథలఁ గైకొని పాత్రపోషణమని
యౌచితియని రసంబని తోఁచినట్లు
కల్పనలుగూర్చ సాఁగిరే కవులు భావి
వారు గనుటెట్టులో క్షీర నీరములను ?

తే. వాస్తవము తెలిసినఁ గదా వాని కల్ప
నంపు సొగసుం గ్రహించి యగ్గింప వలయు
నదె తెలియకున్న యెడల నయ్యయ్యొ వాస్త
వమ్మున నణంగిపోదె కాల్పనిక శక్తి ?

ఆ. ఇచ్చవచ్చినట్టు లీవు కల్పించుకో
పాత్రములను గృతులు వ్రాసికొమ్ము
దేశచరితలందుఁ దెలివిచూపించి క
ల్పింతువేని చరిత కెంతకీడు !

తే. పట్టుమని కూరుచుండి కావ్యము సహస్ర
పద్యపరిమితి రచియించువాఁడు లేఁడు
ఎవ్వఁడే నున్ననది పఠియించు వాఁడు
లేఁడు మఱి పుట్టగొడుగులు లేవవయ్యా ?

తే. గ్రంథమును మున్ను పూరింప రచ్చకెక్కఁ
బదుగురు బళీయనఁగ నప్డు పసదనాలు
ఇప్పుడటుగాదు రచియింప నెంతు ననినఁ
జాలు నోడినిండ బిరుదులు సత్కృతులును.

తే. సుకవిలక్ష్యమ్ముఁ బఠితలందుకొనవలయుఁ
బూర్వ మట్లుంటవిద్య సమున్నతంబు
నేఁడు కవియె పాఠకుల క్రిందికినిజాఱెఁ
జతికిలంబడి పోవదే చదువులమ్మ.

ఆ. సత్కవీశ్వరుండు సద్ధర్మవిదుఁడు గ్రం
థముల వలన జనము నడుప వలయు
నట్లుగాక జనమె యాతని నడుపుచో
గోపదాలు నాల్గు కూలినట్లె.

ఆ. శాసనమ్ముచేసి సరిదిద్ద మఱొకటి
దానికొకటి మరల దానికొకటి
చదువురానికొయ్య శాసింపదొరకొన్న
లక్ష్యసిద్ధి మాటలా ? మహాత్మ !

కం. అమ్మ ! విడాకులచట్టము !
సమ్మతినీతో ననాథశరణాలయముల్
రమ్మనవా ! ప్రబలరోగ వ
శమ్మునఁ ద్యక్తమగు పేద సాఁకెదరెవరే ?

తే. ప్రజల సేవచేయఁగఁ బాటుపడెదమంచు
'నోటు' గోరుదు రదియెంత బూటకమ్మొ
స్వార్థమేదియో యిందులో వరలకున్న
నిన్నివర్గాలెటులు తల యెత్తెనయ్య.

తే. వాఁడు రెండుమూఁడై దంచుఁ బలుకఁగానె
కాదుమూఁడు రెండై దంచు వాదమటర!
ఏకలక్ష్యమైనప్పుడు నైకవర్గ
వాదముల వేల? యిందులో లేదె కిటుకు?

కం. తనమాటకుఁ దనచేఁతకుఁ
దనపదవికి నడ్డులేదు. తనమతముబడిన్
జనము నడుచుకొనవలెఁ గ
ల్గునె యిట్టి నియంతవలన లోకసుఖంబుల్.

తే. ఓటుబలమున నధికార పాటవమ్ముఁ
గన్నవాఁడెట్లు నిష్పాక్షికముగనుండు
నున్న చోవాని యధికార మూడిపోదె?
సమత కొఱఁత ప్రజాపాలనమునఁ గూడ,

ఆ. ధర్మమందు దృష్టి దైవంబుపై బుద్ధి
పార లౌకికానుభవ భయంబు
కామితార్థములను గాఢ వైరాగ్యము
వరలు వాని యేలుబడి ఘనంబు.

తే, బూదిపూఁతలు దున్నని పోట్లయెద్దు
వల్లకాఁడిల్లు తోలుదోవతి యటంచు
శివుని విడిచి రత్నాకరుఁ జేరెగంగ
పేదకాఁపురం బంగనల్ వీడిపోరె?

కం. నరుల మనస్సులలోపలఁ
బరివర్తము జరుగ దేని భటవర్గమ్ముల్
గురుతర శాసనములు ని
ష్ఠుర నిర్బంధమ్ము లెప్పుడును వ్యర్థములే.

తే. బాలవిధవలఁ దలఁగింపఁ బట్టుపట్టి
శారదాబిల్లుదిగె నేమి సంబరంబు
ఇంటనింటఁ బాతికముప్ప దేండ్లకన్య
లెదుగుచుండి రాశాశూన్య దృష్టులలర.

కం. ఎప్పటి విన్నపమప్పుడు
చప్పున జరుగఁ బ్రభులరయఁ జాలక లంచా
లప్పఁ గఠిన శాసనములు
గుప్పించితిమందు రీ లేఖకులు నవ్వుకొనన్.

ఆ॥ ఎంత మంచికార్యమే నగుఁగాక యం
దెంచఁ బూనుకొన్న నెగ్గులొచ్చుఁ
బ్రికృతిలోననున్న ప్రతిపదార్థమునకు
నెండ తగుల నీడయుండదయ్య.

తే. భక్తవంశమందో జ్ఞానివంశమందొ
యుప్పతిల్లఁ గూడునుగాని యెప్పటికి ని
యోగివంశము కూడ దందొకఁడ కృషిని
సలుపవలె సద్గతికిఁ బరుల్ సాయపడరు.

ఆ. ఒకఁడు డాసి వేఁడ మొకమింత చేసి చీ
వాట్లు పెట్టి తఱుముఁ బరివృఢుండు
ఒకఁడు కబురు చేయ నోసఁగు నూటపదాఱు
లెవరి ప్రాప్తి యేదో యెవరి కెఱుక ?

కం. ఫలము లభింపక పోఁగాఁ
దలపోసెద రెడఁదఁ దొంటి తనువునఁ బున్నెం
బులు చేయమైతిమని యి
ట్లలసులో ? జ్ఞానులో తలంచునది చెప్పుఁడయ్యా !

ఆ. పరుగులెత్తనేమి ? పరులునవ్వినేమి ?
తనువు బడలనేమి ? దాఁగనేమి ?
ప్రొద్దు గడవనేమి ? రోసమ్ముడింపక
పందిఁబొడిచినతఁడె బంటుసుమ్ము.

ఆ. పుణ్యమున్నవాఁడె ముందుకు వచ్చును
వానికే లభింతురి పరమ హితులు
వానిమాటె వేదవాక్కగు వానికే
బ్రహ్మరథము జనులు పట్టుచుంద్రు.

కం. వాసిఁగను నలఁతివాఁడు నె
దో సంఘముఁ జేరి, కానఁడోగి సర్వజ్ఞుం
డో సరిలి యున్న యెడలఁ 'గ
లౌ సంఘే శక్తి' యన్న లపితము బొంకే ?

కం. కొందఱకుఁ గలములందుం
గొందఱకును నాల్కలందుఁ గొందఱ కుభయం
బందు నటించు సరస్వతి
యందెలఁగ్రిందుకొను క్రందు లందందొలయన్.

తే. పరమనాస్తికులుంగూడఁ బాలనంబు
సేయుచో సర్వజనులకుఁ జెందునట్లు
శాసనముచేసి జఱుప రే? శాస్త్రములను
ధర్మపదమునుగని యెగతాళి యేల?

తే. కంటికిం గనిపింపదుగాని లోన
దాఁగి సర్వాల నడిపించు ధర్మశక్తి
దొంగయైనఁ గటికయైనఁ దుంటయైన
దానిక్రీనీడఁ దిరుగక మానలేఁడు.

తే. ప్రకృతిపరిణామ మన్నను భౌతికప్ర
భావమన్న మతేమన్న వాక్కుసొంపె
వీనిలోఁ దాఁగియేయుండె విశ్వకర్త
యెఱుకతో విచారించువా రెఱుఁగఁగలరు.

కం. రాముండు గొప్పకవి యని
కాముఁడు, కాముండు గొప్పకవియని రాముం,
డీమాడ్కి జాటు చుభయులు
పామరజనమందుఁ బేరువడసెద రయ్యా.

కం. మృదు మధురమైన గాత్రం
బొదవిననే పాడవలయు, నొదవనిచో నె
య్యదియైన జంత్రముం గొని
మదులకు రహింపుట్టజేయ మంచిదిసుమ్మీ.

తే. హిందువులు ముస్లిములు; బ్రాహ్మణేతరులును
బ్రాహ్మణులు; రెడ్లు కమ్మలు; వైదికులు ని
యోగులున్; శ్రామికులు రైతు; లీగతిని వి
భేదముల స్వార్థపరుఁడె కల్పించె మొదల.

కం. ఏదుర్ముహూర్తమున నీ
భేదము మొలకెత్తెనో వివిధశాఖలతో
రోదసిని నిండె నల్పక
ళా దయితుల కడనె యిది విలాసముచూపున్.

కం. ఈరెండు తెగల యెడఁదల
లోరాజిలు నీవిషానలుని భీకర కీ
లా రేఖ సన్నకారుం
గారించెడు నెన్నఁడీవికార మడఁగునో.

కం. ప్రతినరునకు నీచదువే
హితముగ నవ్వుచును బల్కు నెదుటఁ గనఁబడన్
అతఁ డావలి మోమైనన్
శ్రుతిమాఱిచి తిట్టిపోయు సూరెలఁగనుచున్.

తే. జనము లెట్టియెదుటఁ బ్రశంసలను జేయఁ
దమ పరోక్షమ్మునందు నిందలను జేయ
రెంటిని సమమ్ముగానె నిరీక్ష సేయు
జ్ఞాను లిప్పుడుగూడ నున్నారుజగతి.

తే. హత్యచేసె నితండు సత్యంబె యైన
నేమిసాక్ష్యంబు లేకున్కి నితఁడు నిరప
రాధి శాస్త్రరీతి నను న్యాయాధికారి
న్యాయశాస్త్రవైఖరి నేమనంగవలెనో ?

కం. ఒక్కొకరిఁ జూడఁగానే
మక్కువ నిర్హేతువుగనె మదిలోఁ బొడముః
ఒక్కొకరిఁ గన్నయంతనె
నెక్కొనెడి నమర్ష మెఱుఁగ నేరము కతమున్.

కం. పద్యమర్థమూనట్టులు పాడవలయు
పాటచేతఁ బద్యమ్ము చావంగరాదు
పాలలోఁ దగినంతయే పంచదార
కలిపికొందుముకాదె తాఁగఁగందలంచి.

ఆ. బీదజనము నెపుడు పీడించులోకము
ద్రవిణవంతు నెవఁడు తాఁకఁబోఁడు
బక్కచిక్కియున్న పసినె జోరీఁగలు
చుట్టుముట్టి బాధపెట్టుచుండు.

కం. రాఁకొట్టినఁ బడఁదిట్టిన
భూకాంతులు కవులజోలి పోవరు కవితా
శ్రీకిఁ బ్రియంపడి చేతం
గాక బలములేక జడిసిగా దెప్పటికిన్.

కం. కనకాభిషేక గౌరవ
మెనసిన శ్రీనాథ సత్కవీంద్రుఁడు సామా
న్యునిఁబోలె నిగళబంధం
బున మ్రగ్గుట కెవరిదోషమో చెప్పవయా.

కం. బళిబళి యరసికునెదఁ జ
క్కిలిగిలి పెట్టునటె కళలుగిళలున్ శాస్త్రం
బులు గీస్త్రంబులు జాతికి
గిలిగింతలుగలవె కలికికిం బోలె సఖా.

ఆ. ఎవనియందు శక్తి యెంతగా నుండునో
యంతకీర్తి వాని కబ్బుచుండు
ఒరులు తన్నడంచి యుంచిరం చేడ్చుట
శక్తి తనకులేమిఁ జాటుఁజూవె.

తే. వ్యాఖ్యఁగనకున్నఁ బద్యభావము గ్రహింపఁ
జాలఁ, డాతఁ డాగ్రంథంబు గేలిసేయు
నిట్టివాఁడెకా వెంటఁ బర్వెత్తలేక
యాఁడుఁ జుట్టు బలాదూరటంచునిలిచి.

ఆ. కలియుగంబుకన్నఁ గడచన్న కృతయుగం
బెంతో మంచిదని వచింతురార
తాము చేయు కర్మతతుల నుండెంగాని
కాలమందుఁ గలవె మేలుగీళ్లు.

తే. వాన రాక ప్రాణముపోక బ్రహ్మదేవుఁ
డైనఁ గనుపెట్టలేఁడని యందు రేల?
నేఁడు యంత్రాలవలనఁ గన్పెట్టరయ్యె
వాని రెంటిఁ దత్తచ్ఛాస్త్ర పారదృశులు.

తే. వ్యాస జైమిని పాణిని ప్రముఖ పండి
తప్రకాండులు నేఁడుమాత్రమ్ము లేరె?
యీవిలాతిని మన దురదృష్టమున వ
సించెదరుగాక ముక్కుమూసికొని యెందో.

తే. రచయితృయశంబుఁ బొందఁగోరఁదగు దాని
కకట! యెవని కడ్డుగానంగ హక్కుగలదు?
కాని యొక్కటి పాండితిలేని రచన
మ్రానులేని పువ్వొ చముగులేని దివ్వొ.

కం. అంతో యింతో మిడివే
దాంతము వైద్యము తెలియని తలయే లే దా
యింతయు ననుభవమునఁ జొ
ప్పింత మనెడువాఁడు లేఁడ వెదకిన నెచటన్.

ఆ. పదవిలోన నున్నవాఁ డేదిపల్కినఁ
దోడుతోడ నంత పాడు జనము
తలఁపఁబోక దాని ధర్మ మధర్మము
స్వార్థమేదొ యెడఁద నడఁగియుండ.

తే. కోడలింగని యొకప్పు డోడునత్త
యత్తఁగని కోడ లొక్కప్పు డడఁగియుండు
పండితుంగని ధనికుండు పాణిమోడ్చు
ధనికుఁగని పండితుండును దండమిడును.

ఆ. లక్ష్మిదాతఁజూచి లబలబలాడును
బిసినిజూచి కొసరికొసరి నవ్వుఁ
జెనకలేము స్త్రీలచిత్తమ్ము పురుషుల
భాగ్య మన్ననుడిని భావమహిమ.

కం. తమపని నెఱవేఱువఱకు
నమస్సు వినయమ్ము ప్రార్థనము భయభక్తుల్
తమపని నెఱవేఱఁగ గ
ర్వము వైముఖ్యము తిరస్కరణ మపకృతులున్.

కం. మనజునికడ నేకళయుం
డిన నది లోపలనె యుండ నేర దెదోరీ
తిని వెలికివచ్చుచునె యుం
డును మృత్తికలోని విత్తునుంబలెఁ దఱితోఁ.

కం. ప్రతిరోగమునకు మందులు
ప్రతిరోధించుటకు మాన్పివైచుటకు సుధీ
తతి గనిపెట్టెనె? యింకను
మృతిగనె రోగమున నందు రేటికొ మనుజుల్.

తే. క్రొత్తమందులు వాడుటల్ క్రొత్తగతులు
క్రొత్తవైద్యు లూరూరను గ్రొత్తవైద్య
శాలలన్నియుఁ గ్రొత్తలై జాలుకొనఁగఁ
గ్రొత్తరోగమ్ములును బుట్టుకొనుచు వచ్చె

కం. సహవిద్య కూడదన్నన్
మహిళలు దుమ్మెత్తిపోయ మాన రయిన న
న్వాహా మేనట్టులె పలికెద
దహనుఁడు నేయి గరఁగింపఁ దలఁపనివఱకున్.

ఆ. పూర్ణ నియమపరుఁడు పురుషుఁ డేమియుఁగాలఁ
డగ్నికుండ మధ్యమందు నుఱికి
యర్ధనియమపరుఁడె యగచాట్లు పడునది
నియమ శూన్యుమాట యయిన నేల?

కం. హా! మాకెక్కడ దొరకె 'సు
ధీమణి' భారతము నెల్ల దిద్దివిడిచె నా
సోమాసి యెట్లువ్రాసెనొ
యే మెఱుఁగమ వేదమట్టి దిది యిట్లగునే?

కం. తప్పులుగా దిద్ది యదే
మప్పు? యనినఁ బ్రాఁత తాటియాకుల నిట్లే
చొప్పడెనను నది యెవ్వరి
తప్పో? ప్రతివ్రాసికొన్నతనిదో? కవిదో?

కం. కావేరిగానమును, గో
దావరి సాహిత్యసంపదను, కృష్ణ కవి
త్వావేశము, పెన్న మనీ
షావిభవము జనులకెప్పు డొసంగుచునుండున్.

కం. అనుకొనని ఫలము చేకూ
రెను గష్టముపడకయే యదృష్టం బదిరా
యనెదరు ప్రాక్సుకృతమె యీ
యనువునఁ దోచెనని తెలియ రజ్ఞులువారల్

కం. ఏజన్మమునందైనన్
దాఁ జేయనిదాని నొసఁగునా యీశ్వరుఁ డా
యోజం జేయఁడు చేయఁడు
భూజన మాత్మకృతములనె పొందుచునుండున్

కం. పనియొకటి చేయవలెనని
మనమునఁ దలఁప నది కొండమాడ్కిఁ భరముగాఁ
గనుపట్టుఁ; గార్యరూపం
బున నదియే దూదిపింజ పోల్కిఁ గనఁబడున్.

తే. వేనినో చెవులారఁగా వినుచునుందు
విన్నయంత సేపును మనోవీధి నట్టు
లేనుమాత్రము చేయలేనే యటంచు
నెంచుఁ గాని చేయఁగలేఁడు హీనశక్తి.

తే. గానమున నఱవలఁ జాటిగాని పరునిఁ
జాటరా దాతడెంతగా సణుగుకొన్న
కృతులలోఁ ద్యాగరాజుఁ గీర్తించిగాని
పరునిఁదడవరా దాతఁడెంత ఋషియైన.

కం. జననాయక సాన్నిధ్యం
బును దాతలతోడిస్నేహమును ఘనవిద్వ
జ్జనముల సాంగత్యము దొర
కిన సత్కవికీర్తి మింటికిం బ్రాఁకదొకో!

ఆ. తెలుఁగుబిడ్డ యేఁడి? దేవులాడుచునుంటిఁ
గంటఁబడఁ డటంచు నంట యేల?
పోయి చూడవోయి మొగదలే యుండును
నూతనోద్యమముల చేఁతలందు.

ఆ. దేశమాత నామతింప నేల యటంచుఁ
బలుకుపలువ లిపుడుఁ గలరె యెందు
దేవునిలుపుచోట దేశమాత యు దేమి
టోయి యనెడువార లుందు రాక.

ఆ. బీదవాఁడు ఆఁతిమీఁద నారుబయట
నిదురవోవుఁ గంటినిండ రేయి
మేడలోనఁ బాన్పుమీఁదఁ బరుండిన
ధనికిఁ గునుకురాద తన్నుకొన్న.

కం. పరిచితులుగ నున్న కవీ
శ్వరు సామాన్యజను లెపుడుఁ బాటింపరు త
ద్విరచిత పద్యమ్ముల మె
చ్చరు సమకాలమున నేవిషం బున్నదియో.

కం. మంచిదొ చెడ్డదొ యొకపని
యెంచక చోటిత్తుమే నదే యలవాటై
యించుకయు సడలఁబోక క
లంచుం జీడివలె నంటి లావరినైనన్.

తే. ఆచరణశూన్యుఁడే యెవ్వఁడైనఁ గాని
యితరమతములఁ దిట్టఁ బఱ్ఱోత్తుచుండు
మతసమానము బోధింపని మతము మతమె?
పరులమదిని నొప్పించెడు నరుఁడు నరుఁడె?

తే. జైన బౌద్ధ వైశేషిక సాంఖ్య యోగ
భక్తి వేదాంతముల మఱి బహువిధముల
గ్రంథముల స్వీయభాషలో వ్రాసికొనిరి
ఆంగిలేయు లేమంద మయ్యలుదీక్ష.

తే. వేదముల షడంగముల వివిధ పురాణ
ముల నొకండేమి వాఙ్మయంబు సకలంబు
స్వీయ భాష మార్చికొని రాంగ్లేయు, లాంధ్రు
లందొకనికైన నీబుద్ధి యలరదాయె.

తే. పొద్దుపుచ్చుటకొఱ కేవొ సుద్దులెల్ల
వ్రాసెదరు. ప్రోత్సహించును బత్రికలును
వానినే యౌర! యేమిదౌర్భాగ్య మలము
కొనెను దీయబాస గలుగు తెనుఁగునేల.

కం. ఇది పిల్లకతల యుగ మాం
ధ్రదేశమున నెన్నొ వెలసినవి పత్రిక ల
భ్యుదయమొ గిభ్యుదయమొ య
య్యది వేజేవిషయ మెట్టు లయ్యావి నిండున్.

కం. ఒక్కరు వ్రాసినదే వే
ఱొక్కరు వ్రాసెదరు క్రొత్తయుండదు పేరుం
జెక్కెదరు క్రొత్తదానిన్
మక్కువలివి నేటి తెనుఁగు మాగా[illegible]మునన.

తే. గొప్పగొప్ప విషయములు క్రొత్తక్రొత్త
వాని జాత్యున్నతికిని దోడ్పడెడువాని
వ్రాయువారును బ్రకటించుపత్రికలును
గల వయిననేమి? యెవ్వా రవ్వాలను గనర.

కం. సారస్వత పత్రికలకు
దూరంబుగఁ దొలఁగిపోవుదురు మఱి సినిమా
తారల బొమ్మల కెగఁబడి
పోరుదురు జనాభిరుచుల పోఁడిమి యింతే.

కం. తన పేరుతోడఁ బంపిం
చిన వ్యాసము తిరుగఁగొట్టి చెచ్చెర నద్దా
నినె మాఱుపేరుతో నం
పినఁ బత్రికను బ్రికటింతుర్ విజ్ఞతఁగన రే.

ఆ. కవిత దెసలఁ బ్రాఁకుఁ గండచేనండచే
రూపుచేత నొఅపుఁదీపుచేత
చిత్తరువులచేత నుత్తరువులచేత
పలుకుచేత నడల కులుకుచేత.

కం. అధమాధమ కవిత నయిన
నధికారము చేతనున్నయతఁడు గిలుకఁ గీ
ర్తిధనంబు మొదటఁ బూర్తిగ
నధీనమగుఁ బిదప నెట్టులైన నదేలా?

సీ. అర్థ మేయేటిలో నణఁగిపోయిన నేమి?
మృదుమధురములగు పదములుండ
స్పష్టత యెచ్చటఁ జచ్చిపోయిన నేమి?
అతిదీర్ఘ పదబంధ మలమియుండ

భావ మెవ్వరికిఁ గావలయును? గంభీర
మైన ధారాశుద్ధి యమరియుండ
అన్వయ మేల? సధ్యాహార లక్ష్యార్థ
యుక్తులు కోకొల్ల లుబికియుండ

శబ్దసౌష్ఠవమ్మున కేమి? చాలినన్ని
లక్ష్యములు చిక్క రచయితల కృతులందు
ఎవఁడురా? నేటి వ్రాఁతగాం డ్రిచ్చకొలఁది
వ్రాయు రచనలఁ దప్పనుపండితుండు.

కం. తనకుం దెలియని విషయం
బునయినఁ బరుఁ డేగుదెంచి మొగము నెదుర దీ
నిని మీ రెఱుఁగరుగా యం
చునుబలుక నతండు బళిరె! చుఱచుఱఁజూచున్.

మం. సంకల్పముల కేమి క్షణములోఁబుట్టు
వానికి నిర్దుష్ట పద్ధతిలోన
స్థిరరూప కల్పన చేతఁగా వెలుఁగు
మనుజుని బుద్ధి సామర్థ్యంబు లెల్ల.

కం. తన వలపుఁదలఁపు లెల్లను
వనజాక్షునిమీఁదఁ బెట్టి వ్రాయం గవి పా
వనత లభించు న్వానికిఁ
గని యవి చదివి జన ముబ్బి గంతులు వైచున్.

ఉ. తా నొనరించుకార్యము సదా సఫలంబగుచున్నచో బళీ!
యే నెసమర్థుఁడన్ భగవదిచ్ఛయనుంటయసత్యమంచనున్,
గాని యొకండుచేటు పొడకట్టినచోఁ దన,కప్పు డీశ్వరా
ధీనము సర్వమంచుఁ బ్రణితింపఁదొడంగునరుండుచూడ రే!

తే. పరునిపని నెఱవేఱెనా? వానిశక్తి
చేతనా? యదృష్టమ్మటు చేసెనను
పని విఫలమాయెనా? యేను బలుకలేదె?
వినకపోయె నామాట యంచను నరుండు.

కం. తన యవమానజ దుఃఖం
బును బరు నవమానమునను బోఁగొట్టుకొనున్
తనకగు గౌరవమున క
న్నను బరుని యగౌరవమ్మునకె యుప్పొంగున్.

కం. తనకంటెఁ దక్కువగు వా
నిని సాటికిఁ దెచ్చుకొన్న నే తృప్తి జనిం
చును గొప్పవానినిం గను
గొని యేడ్చుటకన్న నిది తగుంగాదె సఖా!

కం. ఎదియే సమస్య వచ్చిన
గుదిగుత్తురు నీతు లొరుల కొంపలకడ న
య్యదె తమకొదవినఁ గదలరు
మెదలరు పెదవి గదలింప మెయికొన రెపుడున్.

ఆ. వాదమందు గెలుపు వాంఛింతువేని దో
ర్బ్రోడఁ బలుకు నీకుఁ దోఁచినట్లు
అన్యుమాటలెల్ల నాలింపనేల? గ్ర
హింపనేల? యుత్తరింపనేల?

కం. తమ జీవితానుభూతికి
సమమై సరిదాఁకెనేని జన మిది సద్గ్రం
థము, వ్రాసె మహాకవి, యని
ప్రమోదపడు లేదొ తూరుపాఱంబట్టున్.

కం. నాలుగు డబ్బు లొడుపుకొన
వీలుండిన పనికిఁ బఱచు వెరవరి ముందే
ఏలాభము లేనిపనికి
బాలిశుఁడేనయ్య పాలుపడుఁ జేయుటకున్.

ఆ. అన్నిమార్పులందు నున్నది సరె గుణం
బభిధ మార్పునందు నమరవలెనె?
సొంత పేరివ్రాతఁ జూడదు లోకంబు
మాఱుపేరివ్రాత గౌరవించు.

తే. అచ్చుకూటముల్ లేవొట 'నల్లసాని'
యెలమి నందలాలెక్కి యూరేగెఁగాని
నాఁడె యివియున్న ముందఱఁ జూడుమిద్ది
యవల నదిచూతమనఁడె రాయలనుగదిసి.

తే. అష్ట దిగ్గజంబులఁ బిల్చి యాదరించి
నాఁడె? కృష్ణరాయం డేమొ నమ్మఁ జాల.
అట్లయిన వారు స్వల్పుల నాశ్రయించి
కట్టిపెట్టుదు రే తమ కావ్యములను?

కం. ధనమో యుద్యోగంబో
తనవారికొ తనకొ పొందఁదలఁచినచో నా
జనుఁ డెంతవాఁడు గానీ
పనివడి తలవంచి తీఱవలసినదె సుమీ.

ఆ. ఇచ్చవచ్చినట్టు లెదో వ్రాసికొనుఁడు హా
యిగను జదువుకొనుఁడ యెవరికేమి?
యువకు లర్థి వాఙ్మయోదధిఁ దరువంగ
నడ్డపడకుఁడయ్య యంతెచాలు.

తే. కర్మములు కాలబద్ధముల్ కాలము లురు
శాస్త్ర సంప్రతిపాద్యముల్ శాస్త్రములును,
నవ్య సంఘసంస్కారులు నైకగతులఁ
జెప్పసాఁగెఁ గర్మఠుఁ డేమి చేయవలెనో?

తే. నేఁడు పేరు దిగ్వలయంబు నిండుటకును
బత్రికాధీశు నాశ్రయింపంగఁ జాలు.
పూర్వమో దానమునొ శాస్త్రమునొ సమాశ్ర
యింపవలెఁ బెరత్రోవ లేవి లేవు.

తే. దంధనమ్మైన ధనము మీదాపుచేరి
బతిమలాడి గ్రహించి తత్ప్రతిఫలముగ
శాశ్వతమ్మైన కీర్తి నొసంగు మీకు
నర్థి యుపకర్త లెవరో మీ రరయ రేమి?

కం. ఎవఁడండీ యీయాచక
నివహముకంటె సుకృతంబనెడి విత్తము మీ
సవిధమునఁ జక్రవృద్ధికి
భువిఁ గొనువాఁ డెన్నిజన్మములకే నొసఁగన్.

తే. అంద అవునను దానిఁ గాదనఁగవలయుఁ
గ్రొత్తదానినె దేని పేర్కొనఁగవలయుఁ
బూర్వకవులకు లోపముల్ పొడుగవలయు
నూరకయె పెద్దపే రొడి నూడి పడునె?

తే. పూర్వకవులు కంఠోక్తిఁ జెప్పుకొనియున్న
వానికే విపరీతార్థ భావకల్ప
నంబుతోడ నిసుకగూళ్లొనర్పసాఁగి
రిప్పుడు విమర్శకులు క్రొత్త నెత్తిచూప.

తే. కాల విషయాదులంబట్టి గాదె శైలి
మాఱుచుండు మీకొకనమస్కార మస్మ
దీయ గురుభాగవతమును దీనిఁ జూచి
కవులు భిన్నులటం చొసంగకుఁడు తీర్పు.

కం. తమతలలోఁ బుట్టెడు భా
వము లోకకవికంటఁగట్టి బలవంతముగా
సుమతుల భ్రమపెట్టెడి యీ
విమర్శకులఁ గన్న నాకు వెడన వ్యాదవున్.

కం. కవిపద్యమునం దవిగల
వివిగల వని లేనిపోని వెల్లవిమర్శన్
దవిలింతు రాతలఁపు లీ
కవి తలఁచుచునున్న వాఁ్రియఁగలఁడె? కవనమున్.

కం. కవి మాటిన భావమ్ముల
సువిమర్శకుఁ డెత్తిచూపుచోఁ గాదనువా
రెవరు? తమ పిచ్చియూహాలు
కవికంటంగట్టునపుడ కా కాదనుటల్.

కం. జ్ఞానరహితుఁ డరసికు నా
స్థానంబున నెంతవాని సాహిత్యంబున్
గానికిఁ గొఱగాని దగున్
శ్రీనాథుని చరమదశ నిరీక్షింపవయా.

కం. సమయము లభించె నుపకా
రముసేయఁగ దీనిఁ బుచ్చరాదు వృథగ నం
చు మదిందలంచు నధికా
రము చేఁజిక్కిన గుణోత్తరవ్యక్తి బళీ!

కం. తమతోఁ గలసిమెలసి స్నే
హముగాఁ దిరిగినయతండె యౌరా! యధికా
రమొకింత చేపడఁగఁ ద
య్యముపట్టినయట్లు చూచు నటు దరికరుగన్.

కం. మనగుణములె మనచేష్టలె
మనతలఁపులె వేల్పులకు నమర్చికొనుచు వా
నినిగాంచు చుబ్బి తబ్బి
బ్బును బొందుదు మిది వివేకమో మౌఢ్యంబో.

తే. తొల్లి ప్రజలును వసుమతీవల్లభులును
సంస్కృతమ్మనె మిన్నగా సత్కరించి
రిప్పుడిప్పుడే యాంధ్ర మాగొప్పతనము
గాంచుచున్నది యద్దానికంటెఁగూడ.

తే. తొల్లి పద్యమునకుఁగల దొడ్డతనము
గద్యమునకులే దొంటరిగాఁగనున్న
ఇప్పటికి నంతియే కాని యుప్పుడప్పు
డేమి? నీవెక్కువని గద్య మెంచుచుండు.

తే. కందములను గీతమ్ములం గని యొకండు
చప్పరించును గంటికిఁ జాలవేమొ
వృత్తములు తమగతినిఁ దా మేరుకొనును
గాని యివి కవి యంతునుగనుఁగొనుఁజుమి.

కం. కడగొట్టు బిడ్డపై నె
క్కుడు మక్కువ తల్లికేల గొరలునొ? యది యి
ప్పుడెటిఁగితి నారచనలఁ
గడకబ్బమునందుఁ బ్రీతి కడలుకొనంగన్.

కం. సుకవీంద్రుఁడు తాఁ గాఁ డటు
లొకకావ్యముగూడ గిలుకఁ డొరులకృతి విమ
ర్శకుఁ బూనుకొనెడి నీరా
శికిఁ జెందినవారి కున్నె? సిగ్గు శిరంబుల్.

కం. వచనరచనా సమర్థుని
రచయితయను పండితుఁడను రసికుండను గ
ద్యాచణుండను మంతవఱకె
యెచటం గవియంచుమాత్ర మెంచకు మనఘా!

ఆ. ఒకఁడు కులమువలన నున్నతికెక్కును
ఒకఁడు వర్గయుక్తి నున్నతిఁగను
ఒకఁడు దంభనమున నున్నతిఁగాంచును
శక్తి శీలనంబు జరుగునయ్యొ?

తే. దేశమేలునాతండు వధింపఁబడును
ప్రాణములు గుప్పిటంబట్టి బ్రదుకవలయు
రాజయోగంబునీడ దుర్మరణ మకట!
దానికై యేటికో? యింత తగవులాట.

తే. ఒక్కఁ డొకదానికొఱకయి యోర్చి తిరుగ
మఱొకఁడు మఱొక్కదానికై మఱఁగితిరుగు
స్వప్రయోజనం బెదిలేక జాల్ముఁడైన
రిత్తగా నెప్పుడును సంచరింపఁబోఁడు.

ఆ. ఆధిపత్యమున్న యతఁ డపకారోప
కారములను జేయఁగలఁడు గాని
లేనియాతఁ డెంతగా నిక్కి నీల్గినఁ
జిన్న మెత్తు దేని జేయలేఁడు.

తే. మనుజులెల్లర భౌతిక మార్గమందె
చొనిపి యిదె పరమార్థమం చనెదరకట!
కవివరులుగూడ, దీన సంఘమ్ము క్రుళ్లి
పోదె? లోలోన నేండ్లను బూండ్లు గడవ.

ఆ. సన్న్యసనమువచ్చి జాతిని నిర్వీర్య
మాచరించెనంట యక్కటకట!
శంకరాదియతులు సల్పిన దేశోద్ధ
రణముకంటె వీరి రణమె యుఱవా?

కం. ఒకఁడొకటి, మఱియొకఁడు మఱి
యొకటి యిట్టులు చేసిపోవుచుందురు వ్యక్తుల్
సకలవిధ శక్తులు సము
త్సుకత విజృంభించుచుండుఁజుమి లోకమునన్.

కం. నిజమాడిన మీ కేటికి
గజిబిజి? నూటికొకఁడే మొకాని కడమ యె
ల్లజనులు సాహంకారులె
యజహా దసహానులె విపశ్చి దావళిలోనన్

తే. చదువుకొనని పామరుఁడె స్వేచ్ఛగఁ జరింప
భయపడుచునుండు భగవంతువలన నెపుడు
చదువుకొనిన పండితుఁడో స్వేచ్ఛగఁ జరింప
భయపడఁడు పయిపెచ్చెదో వాగుచుండు.

కం. నేనిప్పటివఱ కెచ్చట
నైనన్ వేదాంతివంటి స్వార్థపరు నొరుం
గాన నతఁ డొరులకుఁ గఱపుఁ
గాని కఱపినంత చేయఁగడఁగఁడు తానున్.

తే. ఒకప్రయోజనం బెదొ దాఁగియుండకున్నఁ
జెలిమి పెద్దతనంబునఁ గలుగునయ్య?
యభము శుభము నెఱుంగని యట్టిప్రాయ
మందె నిష్కల్మషస్నేహ మంకురించు.

తే. ఎన్నిభాషలు నేర్చిన నెన్నిశాస్త్ర
ములను జదివిన నెన్ని యపూర్వకావ్య
ముల రచించిన నేలరా? పొట్టఁబొడిచి
వెదకిన న్మంచితనము కన్పింప దేని.

ఆ. ప్రాగ్భవంబు లేదు ప్రాక్కర్మములు లేవు
ఏవి లేవటందు వెందుకయ్య?
ఒక్కఁ డూరకున్న నొడిలోనఁ బడువచ్చు
ఒకఁడు కష్టపడిన నొదవ దొడమి.

ఆ. తడవుకొనక కాగితంబులు చూడక
గుక్క త్రిప్పుకొనక దిక్కులదరఁ
జెప్పుచున్నఁ జాలుఁ దప్పులో యొప్పులో
అర్థముండకున్న నలరు జనము.

ఆ. తెలుఁగుఁదనమె కాదు తియ్యందనమె కాదు
కులుకునడకె గాదు కుదురె గాదు
ఆటవెలఁదికున్న యందు దేనికిఁ గద్దు?
ఆంధ్రమునకు జీవ మాటవెలఁది.

తే. త్యాగరాజ! నీకృతులను దలఁగఁద్రోయఁ
దలఁచిరఁట కొంటెయఱవలు దానికేమి?
నీకృతుల ప్రతిబింబము న్దీసికొనుచు
నఱవమున వ్రాసికొనెద రేమాగడంబు!

కం. సరె కాని భక్తమణి! త్యా
గరాజ! నీకృతులు గానకలితము లగుచోఁ
బరవశులఁ జేయుఁ గానీ
ఉరక చదువఁ జేయ వెచట నుంచితొ కిటుకున్.

తే. లేశమేని ధారాశుద్ధి లేని హయము
నెక్కి సుఖియించువాఁ డుండునేని యుండుఁ
గాని, కృతిని ధారాశుద్ధి లేనియెడల
నొక్కఁడును సుఖియించువాఁ డుండఁబోఁడు.

ఆ. అంబుధార లేని యంభోద మేటికి ?
ఆజ్య ధారలేని యన్న మేల ?
ఆశుధార లేని యాశుకైసరుండేల ?
అశ్వధార లేని యాజి యేల ?

ఆ. ఏమతస్థుఁడైన నెంతవాఁడైన వె
న్వెనుక కరుగుటకును వెడలెనేని
హేతు వందఁబోక యెచటనో యొకచోట
వెలికిలఁబడి తేలవేయుఁ గన్ను.

కం. మతవిశ్వాస మ్మతిమూ
ఢత యందురు నాగరులు కటకటా ! మన సం
స్కృతి చెక్కు చెదరకుంటకుఁ
గత మెఱుఁగర యన్యమత విఘట్టనములకున్.

తే. చెప్పుచుండుఁ బైపైఁబ్రజాసేవయని య
తండు చేయఁబోని యకృత్య ముండఁబోదు
రాజకీయవాదియయి స్వార్థపరుఁ డెట్టు
గాఁడో ? యట్లైన నింటనే కదలకుండు.

తే. తాను నిర్దుష్టలగ్నమ్ముఁ గానలేఁడు
పరులు పెట్టినదాన లోపములు చూపు
నన్యకృత మొప్పుకొన్న స్వీయాధికత్వ
మడుగు పట్టి పోవునని భయాతిశయము.

తే. జాతకము చూచి జరిగిన సంగతులకు
నేకరువు పెట్టు హేతువు లెన్నియేని
జరుగఁబోయెడివానిని జాటుటకు న
దేల? జోస్యుఁడు తటపటాయించుచుండు.

తే. రెండుబేడ లొసఁగు హస్తరేఖ లరసి
భావిశుభముల నీవి నేఁ బలుకుదునన
నేను నీకిత్తునో? లేదో? దానిముందుఁ
జెప్పుమన వాఁడు వెన్కకుఁ జేరఁబడును.

ఆ. ఒకటిరెండుపూటలకు వ్యాధి కుదురు నం
చొరుల కౌషధంబు నొసఁగు వెజ్జు
ఇంట భార్య జబ్బు కితర వైద్యులఁబిల్చు
నిందులో రహస్య మేదియొకద.

ఆ. పాలు పెరుగు నేయి వడ్లు వంటకమును
గూర గాయ పండు నీరు నిప్పు
గాలి యెఱువు గూడఁగల్పితమ్ములె వైద్య
శాల లెన్నియేనిఁ జాలు నెట్లు?

ఆ. ప్రకృతిసిద్ధముగను బాటి నేలఁ బెరిగి
పండి యొఱగినట్టి వస్తువులను
మ్రింగువానిశక్తి కృత్రిమసిద్ధ ప
దార్థ భోక్త కుండునయ్య? యెపుడు.

తే. ఎచట నేఁ బ్రమాదంబున్న నేమిగాని
యాంగ్లు లఖిల సంస్కృతవాఙ్మయంబు తఱచి
వ్రాసిన విమర్శలకు ఋణపడమె? యసలు
గ్రంథముల యున్కియే యెఱుంగముగదయ్య.

తే. పుస్తకముఁ జేతికిచ్చిన ముందుగాను
బండితుల యభిప్రాయముల్ పాఱఁజూచుఁ
గాని గ్రంథంబులో ముక్కఁ గాంచఁబోఁడు
తారతమ్యనిర్ణేత యీతండ నేఁడు.

కం. తమకిష్టమైనచో సుగు
ణములని వాదించు దుర్గుణంబులఁ గూడన్,
దమకిష్టము కాదో సుగు
ణములను దుర్గుణములంచు నాలుకద్రిప్పన్.

తే. సుగుణ దుర్గుణంబులు మనుజహృదయాన
నెగడుఁగాని వస్తువులందు నిగుడఁబోవు
బ్రహ్మసృష్టిలో నిట్లు చెప్పఁగలఁ గాని
జీవసృష్టిలోమాత్రము చెప్ప లేను.

తే. ఎంతపిచ్చిదిలోకము ! ఋజు పథమునఁ
దనవిధిని మానముగఁ జేసికొనుచుఁబోవు
వాని నసమర్థుఁడనును డబ్బాను స్వాయము
గానె కొట్టుకొను నశక్తు ఘనతముఁ డను.

ఆ. ఇష్టమున్న నీకు నిష్టములేకున్న
నొక్కమాట చెప్పుచుంటి వినుము
ఆయమునకు మించి వ్యయము చేయకుము మం
చమ్ము మించి కాళ్లు చాఁపనగునె?

కం. పైవాఁడు స్వీయుఁడైనం
బోవును సర్వాపరాధములు త్రుటిలోన్
పైవాఁడు పరుం డగునో
యావానియవస్థ రిపునకైన వలదయా.

కం. కొందఱు ఋజుపథమని తమ
బందుగులకె కీడు సేయఁబొల్పుదురు; రిసీ?
పందలు వ్రాసిన శాస్త్రముఁ
గొందురె? యని నడచుకొంద్రు కొందఱుస్వేచ్ఛన్.

ఆ. తనను గొప్పవానిగను జను లనుకొన
గొప్పవాని చెంతకు నెటో చేరి
వాఁడుచూడకున్నఁ బండ్లిగిలించి మా
టందుకొనఁగఁజూచు నధికునట్లు.

కం. నాకధికారము వచ్చిన
లోకమ్మును బీదతనములో నుంతునె? యం
చేఁకారినవాఁ డెటులో
గైకొని యధికార మవలఁ గనఁడు స్వజనముఖ్

కం. పేరు ధరనిల్వ గుణవి
స్తారు లొనర్చెదరు సప్తసంతానంబుల్;
ఏరీతిపున్నె మెఱుఁగని
వారు సమాధి శిలఁ బేరు వ్రాయింతురయా.

తే. నాపలుకువిని తమ్ముఁడా! కోపపడకు
మెఱుఁగవనికాదు హితమని కఱపుచుంటి
నాత్మనమ్మించి గొంతు గోయంగఁబోకు
పరుల యున్నతిఁగని యేడువంగఁబోకు.

కం. ఎదియెట్లు జరుగనున్నదొ
యది యట్టులె జరుగు నేల యత్న? మనుట నో
ప్పదుఁ గాని ఫలాకాంక్షుల
మది కానుడితీరు పిడుగుమాడికి నుండుఖ్.

కం. అనుదినము రేయి శయనిం
చినప్పు డీనాఁడు నేను జేసినపని యే
మనియైన నొక్కపరి మన
మునఖ్ స్మరించుకొని నిద్రపొమ్మా యవలన్.

ఆ. ఏను జన్మమెత్తి యీఘనకార్యము
నాచరించినాఁడ నంచుఁ జేయి
గుండెమీఁదఁ బెట్టుకొని చెప్పవయ్య యా
మిత్తి నీకుఁ గరము లెత్తి మ్రొక్కు.

కం. ఇతరప్రాణులకంటెన్
మతిగల నరజన్మ మెంతమంచిదిరా! యీ
స్థితిలోనే మనము పరము
వెతకికొనమొ సదవకాశవిచ్యుతిఁగనమే?

ఆ. ఒక్కఁడొకని నేదియో చేసి చూడునా
దెబ్బయంచు మిన్నుల బొబ్బరించు
దాన నెవరి కేమి? తాను జేసినయది
తనకె వచ్చి చుట్టుకొనును బిదప.

కం. పరలోకము కలదని కొం
దఱు లేదని కొంద ఱనియెదరు లేదని పో
మరి యేటికంటెఁ గలదని
యురుపుణ్య మొనర్ప నవల నొందము వగపున్.

కం. తొలిపలుకుల నమ్మక వి
జ్ఞులమాటల వినక నీయనుభవము గనకా
ప్తుల నుడి చెవిచేర్పక నె
చ్చెలి! పరసుఖ మెట్టులింకఁ జెందెదవయ్యా!

తే. ఇంద్రియసుఖంబులం ద్యజియించి వైచి
మనములోఁ గామమును గ్రోధమును జయించి
యెప్పుడాత్మలోఁ గ్రీడించు చెవ్వఁడుండు
నాతనికిఁ బరలోక భయంబు వలదు.

తే. కర్మములకు నాద్యంతముల్ గలవటంచు
కాయమది కర్మబంధనకర మటంచు
నెవఁడు హృదయంబులోపల నెఱిఁగియుండు
నాతనికిఁ బరలోక భయంబు వలదు.

తే. త్రికరణంబులతోఁ గీడు తెరువు సనక
శక్తికొలఁదిని బరులకు సాయపడుచు
విహితకర్మంబు లెవఁడు గావించుచుండు
నాతనికిఁ బరలోక భయంబు వలదు.

తే. ఎవను విషయాలపై కేగనీయఁబోక
ఏగునేని చెవుల్ పట్టి యీడ్చి తెచ్చి
యిష్టదైవత పాదాల యెదుట నిలుపు
నాతనికిఁ బరలోక భయంబు వలదు.

కం. మది యునికిఁ దెలుపుఁ దలఁపులు
గదలాడుచు, నేతలంపు గ్రాలదో యదియే
గదరా మనోలయస్థితి
యదియే యాత్మానుభూతి నందు తెఱుంగున్.

కం. పరమాత్ముఁడె యున్న యెడల
దొరకఁడె? కనఁబడఁడె? యనెడిదుర్బుద్ధు లయో
పరికింపరాదె? తమమది
నిరుతలఁపుల నడుమనె వసియించె వెలుఁగుచున్.

తే. తనువు కర్మధీంద్రియములు మనము బుద్ధి
చిత్త మయ్యహంకృతియు మహత్తు ప్రకృతి
అన్నియును జడములె వీని నాడఁజేయు
వాఁడెగా సూత్రధారుఁ డీశ్వరుఁడు పరుఁడు.

కం. తులువపనులం బొనర్చెడి
పలువలె యెప్పుడైనఁ గాని పదిమందిగనన్
సలుపుదురు భజనముం గం
తులు వైచుచుఁబరవశత యెదో గల్గినటుల్.

కం. నిజమైన భక్తుఁడెప్పుడు
ప్రజతను మెచ్చికొనుకొఱకుఁ బాటుపడఁడెదన్
భజియించుచుండు స్వామిని
భజనకు ఫలమైహికంబ? పరమార్థంబా?

తే. వెలువడును వాదమేదియో విషయముపయి
నిలువదది మఱొక్కటివచ్చి కలయఁబడును
ఇట్టులెన్నియో పుట్టునందేది గూడఁ
దేల దజ్ఞులవాద మీలీలనుండు.

కం. ఒరు లెఱుఁగని యవి కొ్రొత్తవి
కఱపుటకే యుద్యమంబుగా డెకేఁగిన వే
మరలన్ జ్ఞప్తికిఁ దెచ్చినఁ
గొరడాతో హాయము మేలుకొల్పినటులగుఁన్.

కం. మదియసలే చంచలమై
నది పైఁగా సుకవియయ్యెనా ? యింకం జె
ప్పఁదరంబె ? సతము భావస
ముదయ మొదవిపట్టఁ బగ్గములు లే కుఱుకున్.

కం. కావున నె యట్టిచంచల
భావముఁ బరమాత్మమీఁదఁ బట్టుకొలుప శా
స్త్రావళి నిరంతరమ్ముగ
గోవిద ! చెవినిల్లుగట్టుకొని ఘోషించున్.

కం. తొలి నాచేసినకర్మం
బుల కనుగుణములగు కష్టములు సుఖములు ని
చ్చలొసఁగు నీశ్వరునకు మొ్రొ
క్కులు సలిపెద మిన్నకంటి గురునాథకవిన్.

# భావలీల

## తృతీయాశ్వాసము

తే. శ్రీకరము శుభ్రమొక్కట కృష్ణమొకట
క్రమఫుల్లారవింద సంకాశమొకట
ఉష్ణమొక్కట శీతలమొకట వెలుఁగు
వస్తు వుచ్ఛరించుత శుభమస్తటంచు.

తే. ప్రథితసుకవి ధారాపురీప్రభువరుండు
నాగరాజుభాషాపతి నాగరాజు
ప్రౌఢి రచియించినట్టి భావశతకమ్ము
నాంధ్రులు పఠించియలరంగ ననువదింతు.

తే. రమణి యోర్తు వసంతకాలమునఁ జకిత
యై మనోభవుం డించువి ల్లందుకొనఁగ
నేమితలఁచెనో కాని దోయింటినిండ
నెత్తెఁ గమ్మని నెత్తావు లీనుపూలు.

భావము :- పూలంజూచి మన్మథుని మౌర్విగానున్న తుమ్మెదలు పరువెత్తివచ్చునని. మౌర్విలేకున్న బాణమేయలేఁడుగా.

తే. ఎంతవింత! ప్రశాంత వసంతమందుఁ
బూవుఁదీవల యీరముపొంతనుండి
ఊర్పుగాడ్పులు పుచ్చంగ నులుకుచుండె
వారిజాంతాయతాక్షి యవ్వాలనుగనుచు.

భా. తనయూర్పుగాడ్పుల నెత్తావికి తుమ్మెదలు వచ్చి చుట్టుముట్టునన.

కం. మగువయొకతె వేసవిలో
దగ పీడింపంగ గంగదఱిసి యమృతము
న్నగు నీరు హస్తపల్లవ
యుగిఁ గొని చూచుచును ద్రావకుండె నిదేమో.

భా. తనహస్తపల్లవకాంతి ప్రసరించినీరెఱ్ఱగానుండ రక్తమనుకొన్నది.

కం. అలనాటి విరహదుఃఖం
బులు దలఁచి రఘూద్వహుండు పూర్ణమృగాంకుం
బలుమఱుఁ గనుసీత నరసి
తలంకి యాటబలె మూసెఁ దన్నయనయుగిన్.

భా. సీతబంగరులేడిని దెమ్మనినటుల చంద్రబింబమందలిలేడినిదెమ్మనునని

కం. వల పెడఁదలోనఁ ద్రుళ్లిం
తలు పెట్టఁగఁ గౌఁగిలించి నారాయణు న
క్కలశాబ్ధికన్య యేటికొ
వలదు వలదు కనులఁ జూడవల దనిపలుకున్.

భా. హరిరెండుకన్నులుసూర్యచంద్రులు. తనచేష్టవారుచూతురని.

ఉ. మారసమానచారు సుకుమారశరీర! యొకింతమాపయిం
గూరిమికల్గెనేఁ దిరుగఁగూడదు వేడుకనుత్సవాల నీ
దారిని సారెసారెకు, సుధాస్రవముల్ భవదుక్తు, లింటిప్రా
కారము ప్రోన్నతంబు, స్మరకాతరమాదొరసాని నిచ్చలున్.

భా. ఉత్సవావలోకన వ్యాజమునమాబుజా లెక్కి నిన్నీమె చూచును.

ఆ. కళలునేర్చియున్న కామినియొక్కర్తు
విమలరత్న మండపమునఁదిరిగి
యాడుకొనుచు భర్త ననపరాధుని జూచి
యట్టె కాలితోడ నెట్టివైచె.

భా. రత్నములస్వప్రతిబింబముంజూచివిభుడన్యకాంతం దెచ్చుకొనెననుకొని.

ఆ. హరుని యుత్తమాంగమందు గంగనుగన్న
వెంటనే హిమాద్రివిభునికన్య
గాఢమైన మానగరిమచే విభు మేనఁ
గొండొకయెడ ముద్దు గొనఁగసాఁగె.

భా. పార్వతికోపముచే విషముద్రావనెంచి హరునిగరళకంఠము చుంబించె.

ఆ. తొల్లి గ్రుక్కగొన్న దెల్లను సంద్రంబు
గ్రక్కివైచినాఁడు కడముగొనక
యీయగస్తిమౌని యెఱుఁగఁడా! యేమి? మా
యోషిదాళి విప్రయోగ బాధ.

భా. త్రాగిన చంద్రునిగూడ వెడలఁగ్రక్కెను.

ఉ. భూరివినీల నీరదసమూహసముజ్ఝిత శారదత్రియా
మారమణీయవేళ మణిమండిత పాండురసౌధకేళికా
గారమున న్వియోగిని యొకర్తుకపండి సుధాబ్ధివాసుకిన్
సారగణంబు మందరము నక్తచరేశులఁ దిట్టిపోసెడిన్.

భా. వీరివలనఁ జంద్రుఁడు పుట్టెనని.

కం. ఒకతె వియోగిని మదనా
ధిక బాధ సహింపలేక తెగఁబడి పలుకున్
శుక శారికేందు మధుకర
పికాదులకు వర్ధనంబు వెలయుతమంచున్.

భా. ఏతద్బాహుళ్యముచేఁ ద్వరగా మరణింపవచ్చునని. లేక
వీరందఱుఁ జత్తురుగాకయని.

మ. అణఁగుంగావుత సైనికార్భటులు రాజా! నీమృగధ్వంసన
ప్రణయం బించుక నిల్పుఁగాత గుణనిక్వాణంబు చల్లారుతన్
క్షణకాలం, బదె చంద్రుఁడంటుకొన రాఁగా ప్రేల్మిడింబల్లురో
హిణి నన్మ్రుట్టకు ముట్టకన్య నిదియేమీయంచు సంరబ్ధయై.

భా. రాజు వేఁటంగని చంద్రునిలోని మృగముపాఱిపోఁగా నప్పటిచంద్రు
రోహిణిగని గుర్తింపలేక పరుఁడనిభావించె.

మ. అతివా! వర్తులముల్ కఠోరములు తీక్ష్ణాగ్రంబులంచత్సము
న్నతముల్ నీకుచముల్ నిజేశునురముం దప్పించి యేలమ్మ పృ
ష్ఠతలాశ్లేషము? లేమనంజెలి! తమిన్ సంక్రీడఁ గెమ్మోమ్ము వినో
క్కిలిఁ గిన్కంబయనించె వానినొకచక్కం ద్రిప్పికోవద్దటే.

భా. ములుగఱ్ఱపోటునకునఱ్ఱదాఁకి వచ్చునుగా.

ఉ. ఒక్కతె పాంధుకాంత దిటవ్రానివసంతమునందుమావులన్
మెక్కి పికంబులెయ్యెడలనిక్కుచుఁ బాటలుపాడుచుండునో
యక్కడికేగి తత్పరిసరావనియెల్లను దొప్పఁదోఁగఁగాఁ
జక్కనిగొంతుతోఁ గురియసాఁగెనుగానమరందబిందువుల్.

భా. తనకంఠస్వరమువిని కోకిలసిగ్గిలి మౌనమువహించునని.

కం. నింగి మొయిలు గనుచునె చని
యంగన నగరోపవనమునం దాటల కు
ప్పొంగుచుఁ బున రాగమనము
నం గడువడి రాద జోరున న్వానపడన్.

భా. త్వరగానడచినచోఁగలుగు శ్వాసాదికముఁజూచియ త్తమామలుతన్న సతి
గా భావింతురని. — లేదా — సంభోగచిహ్నములు తొలఁగవలెనని.

తే. చెక్కిళులయందు మకరికల్ చెక్కు చెదర
కున్న సవతినిగని మోదమొందె నొకతె
కాని లాక్షా క్తనిటలునిఁ గంట నిదుర
లేని ప్రియుఁగాంచి మాత్రము క్లేశపడియె.

భా. సంభోగములేమి మకరికల్ చెదరలేదు. సతిపాదాలపైభ ర్తపడెను.

కం. గరిత ప్రియువియోగంబున
స్మరజూ ర్తికి శీతలోపచారము లెల్లం
దొరఁగి సకలస్థల ప్రస్ఫు
రమగు వెన్నెలను సుఖ మమర సేవించున్.

భా. ప్రియస్పర్శయీ వెన్నెలకెచట నేని కలిగియుండదాయని.

చ. వనితలువారువేలు ప్రియభర్తలొకప్పుడు దూరదేశమే
గునెడలఁ గౌఁగిలించుకొనికోరుచునుందు ప్రునస్సమాగమ
మ్ము; నటులనేనుగోర శుభముల్ దమకబ్బఁగ నెంచునాకు నీ
చను నెడ జీవితేశ్వర! యొసంగకుమా వృథగాఁగ ప్రుంగిలిన్.

భా. నీప్రస్థాన కాలమందలికౌఁగిలిచేనప్పుడ నాప్రాణాలెడలును.

చ. పితృగృహమందు రేవదరిఁ బ్రీతసఖీతతిఁగూడి హాయిగా
నతివరొప్పుచ్చియున్న సమయంబుఁదలంచి కలంగఁబోకుమా
పతియనుకూలుఁడంగభవభాసురుఁడన్నుఁజెలుల్ లసత్కళా
చతురలు దీర్ఘికల్ జలజచారువు లేమికొ అంతనీకటన్.

చ. అలిగిచనెన్విభుండెటకొ, యస్మదగారముచిన్న, దత్తమా
మలెటులొయున్నదరన్నిపుడుమాచెలియిట్టను బెండ్లిపోయెదన్
మెలఁగకుమెండ, సూరినడిమింట వెలింగె,బురోత్తరాశ భా
సిలుఁబువుటీరముల్ కొలనుశీఘ్రమయామెడ కేగుపాన్థుఁడా

భా. తానునటకువత్తునని సూచన.

చ. జలరుహనేత్రియొక్కతె నిజప్రియవల్లభుఁ డన్యదేశమం
దెలయుచునుండ మన్మథసమృద్ధసుమాశుగఘోరతాడనం
బులకు సహింపలేక తనువుంద్యజియింపఁదలంచి యామ్యది
క్మలయధరోదితానిలము మాటికిమాటికిఁద్రావుచుండెడిన్

భా. మలయపవనము భుజంగభుక్తమై యుండుఁగాన విషకలితమని.

తే. శాస్త్రకథిత సత్కర్మముల్ సలుపువాఁడు
న్యాయ్యపథమున నెప్పుడు నడచువాఁడు
నిఖిలలోక హితంబుగా నెగడువాఁడు
హరియురంబును సర్వాశూన్యంబు చేయు.

భా. న్యాయవంతుఁడు లక్ష్మినొందును.

ఉ. ఎట్టిదొ నీదు గుండె సతి యెప్పు డమంగళశంక నేలపైఁ
బెట్టదు నీదు రాక వినిపించెడి కాకికిఁ బిండముల్, మఱిం
బెట్టును గోడమీఁద నెదవీడి భయంబును గేలుసాఁచి యో
దిట్టఁడ! చంద్రరేఖ పగిదిం దగు నీయమ వేగ నేలుమా.

భా. సతికృశించియుంటచే గాజులు జాఱిపడును. అది యమంగళమని భయము.

మ. అలిచే శోభవహించె లేఁతచివు, రేణాంకుండు శోణాంకుఁడు
త్పలయుగ్మంబును మంకెనం దొరసె, నిద్ధంబైన శంఖంబు రే
ఖలఁ బోల్పారెన టంచు ధూర్తసఖి వాగన్ ముగ్ధఁ గొంపోయెని
న్డుల నేమున్నది చూడ, రమ్మని శరుండున్ దీర్ఘికం దోఁగఁగన్.

భా. వ్యభిచారచిహ్నముల జలక్రీడచేఁ బోఁగొట్టుకొన ముగ్ధం గొనిపోయె.

తే. నీరదములు దిగంతముల్ నిండియుండ
దవ్వులందున్న ప్రాణభర్తం దలంచి
నాతి కార్చు కన్నీరు స్తనాలఁ బడఁగ
వదనమందలి తిలకంబు చెదరిపోయె.

భా. వేఁడిచనులపై నీరుపడఁగనే యావిరిలేచి మొగముంగప్పబొట్టుమాపె

తే. కేలుఁదమ్మి నిందీవరాక్షి గనుచుండ
నచట నే మధుకరములే, దైన నేల
మదనవశమున గండుతుమ్మెద యొకండు
వచ్చి యొయ్యారముగ నందు వ్రాలెనొక్కొ?

భా. ఇందీవరాక్షి దృక్కాంతిని భ్రమరియనుకొనె.

శా. వీరోత్తంసుఁడు నాగరాజు రిపుభూభృద్వర్గ విధ్వంసన
ప్రారంభోద్యముఁడౌటఁదన్నృపకళత్రంబుల్ విచారించి కా
న్తారాంతర్గిరి నీలరత్నతటులం దాముండి భృంగంబుల
న్నీరేజంబులఁ జక్రవాకముల నన్వీక్షింతు రొక్కుమ్మడిన్.

భా. నీలరత్నములం బ్రతిఫలించిన తమ ముంగురుల ముఖముల స్తనముల నేచూతురు. లేదా నీలమణిజనితాంధకారమునఁ దాముండి తెల్లవాఱినదో లేదో తెలిసికొనఁ జక్రవాకసంయోగము- నీరేజవికాసము-భృంగసంచారము చూతురు.

చ. కనులవియోగబాష్పములు గ్రమ్మ నెలంతుక తెల్లవార్లు లే
ఖని గయిఁబూని యెట్టులు లిఖించెనో ప్రేమపు లేఖ జీవితే
శునకు నుబంప నాతఁడది చూచి నిరక్షరమాటకున్ముద్రం
బును నగపున్వహించి తలపోసెను టెక్కులు లేమికెంతయున్.

భా. టెక్కులున్నచో నెగిరిపోయి యొడలు దెలియని యా విరహిణికడ వ్రాలుదు నేయని వాఁడెంచె.

కం. రమణుకడ కరుగ వడిఁ ద
త్సమయోచిత భూషణములు దాల్చి విపుల నే
త్రములం గాటుక వక్షో
జములన్ హారంబు సుదతి సవరింపదయా.

భా. పెద్దకన్నులగుట నాలస్యమగునని, కామాగ్నికి హారము దగ్ధమగునని. లేదా - వ్యభిచారము వెల్లడియగునని.

తే. ఇప్పుడే యుదయించిన యిందుబింబ
మామ్రి నవపల్లవద్యుతి నధిగమించి
పూర్వదిక్కామినీ ముఖభూషణత్వ
మంగనా! భవదంగత్వ మభినయించె.

భా. భూషణత్వము = బొట్టు; అంగత్వము = మొగము.

చ. అలరులవిల్తుఁడేయు పువుటమ్ములకున్మది వీఁలితోయ్యలిం
దలఁచుచుఁ బాన్థుఁడ్లోకుఁడునిదాఘమునన్న డిమిట్టిసూర్యుఁడు
జ్వలుఁడయియుండ దప్పిగొని పర్విడిశూన్యసరోవరంబు న
ల్లాలఁకులుసూచియంబువులుపానము చేయకెమోదమ న్దెడిన్

భా. నీళ్ళులేని సరస్సున మదనబాణములగుతామరలు లేమికిమోదము.

కం. పరిపాక సమయ పాండువుఁ
బరిణత పత్రాళి కాంతి పరిహాసిత రవిౘ
జెఱకుందోఁటంగని త్వ
త్స్ఫురదనురాగమున నెమకు సుదతి ఫలమ్ముల్.

భా. పండిన చెఱకుఁదోఁట నఱకివేయుదురుగాన సంకేతస్థల భంగమగునని.
లేదా. మన్మథునివిండ్లు చెఱకులుగాన నవిపోవుటవిరహిణులకుఁభీతి.

కం. చందురుఁడు మెల్లఁగాఁ దూ
ర్పుం దిప్పకుఁ బాకి సతులమోములు గనుచున్
గొందఱకు ముత్తెసరుల కె
దందలఁకి గణింపసాఁగె దారలనెల్లన్.

భా. మగువల మొగములచేఁ జందుఁడోడి తనభార్యలు బందీకృతలైరేమో
యని ముక్తామణులంజూచి భ్రాంతిపడెను.

కం. సంపూర్ణచంద్రముం డుద
యింపం గని వారిజాస్య యేమనుకొనెనో
గంపమడంగ గ్రహించె
జ్జంపకమాలికల శిరమునన్ ధరియింపన్.

భా. చంద్రుఁడుదయించుటచే ముకుళించుకొను పద్మములనుండి తుమ్మెదలులే చివచ్చితనమోముదమ్మి నివ్రాలుననిసంపెఁగదండలుదాల్చెను. సంపెఁ గలకుఁ దుమ్మెదలకుఁబగ.

ఉ. ఏలనుతాపమజ్ఞత? నిదేమిటి? కన్నులనీరు, దృష్టిరిం
ఛోళులనెల్లదిక్కులకుఁ జోపెదవేటికి? ప్రేమగుర్తిదే
ఆళినిదిట్టెదూరకయె యంఘ్రులలత్తుక చూడవో చెలీ!
ఏలకఠోరభాషణము లేటికిసర్వమునం దనిష్టముల్.

చ. ఎదివర మేదికాంతికర మేయదిహృద్యము వాంఛనీయమె
య్యది, యదిత్వన్మనోనుగతయా తరుణీమణిచేతయుక్తమా
పదమున స్థాపితంబుగద, వల్లభ! దానిఁబ్రణామకోటి నీ
చదశకుఁదెచ్చి తీవిధిపొసంగునె నీకును దుష్టమానసా!

భా. ఆమెముఖతిలకమును నీమొగమునకంటించినది. దానినినీవునాపాదముల కంటించితివి.

ఉ. చూడవెవీఁడెనీయెదుటశోభిలునాథుడుఁమాన్యముల్నుడుల్
తోడిచెలుల్ వచించునవి, ధూర్తుఁడెవండిట లేఁడు, రత్నపు
న్మేడనుముద్దరాల! తగునేపెడమోమిడ? నంచుబోటిమా
టాడఁగ వేడియూర్పులనయంబునుమానినిపుచ్చె నేర్పునన్.

భా. ప్రియప్రతి బింబముంగప్ప నిట్టూర్పులుపుచ్చెను.

కం. యువకుఁడు హారము చూపఁగ
యువతి శిరముమాటిమాటి కూపుచుఁ గరప
ల్లవమునఁ గృష్ణాహికి దీ
టవు తన కచభారమెత్తి యల్లనచూపెన్.

భా. నామనస్సు నీయందుస్వచ్ఛమని యువకుఁడు. కాదుమలినమని యువతి.

తే. ముద్దరాల! యొకర్త వెప్పుడునుగూడ
నరుగఁబోకు ముద్యాన విహారమునకు
గతదినము పోతివో! యేమొ! కంటకతరు
లంటుకొనఁ జన్నుఁగన దుఃఖమందుచుండె.

భా. పతియెదుటఁ జెటిమాట స్తనసఖాంకగోపనము.

మ. కనులజ్గాటుక మోవులన్దములముల్గాళ్లఁ జతుద్రవ్యముల్
ఘనగండంబులఁబత్రవల్లు లఖిలాంగంబందు శ్రీఖండముఁ
దనరుస్వీరికినెప్పు, డేనెయిటులున్నంజూచి మాయత్తయే
మనునో? నాదుసపత్ను లేడువరటమ్మా కుల్లిలోలోపలన్.

శా. పీనోత్తుంగఘనస్తనీ యరుగవే వేగంబు సౌధోపరి
స్థానక్రీడలుమానిలోని, కటుగాదా? నిన్ను వీక్షించి తా
రానాథుండవురౌర! వల్మికముగర్భంబందు జన్మించు వాఁ
డౌనే సత్యవచస్కుఁడూర్జిత గుణుండంచు న్విచారించునే

భా. చంద్రోదయదర్శనమున జక్కవకవ విడిపోవుగాకయని రాముఁడు పల్కినట్లువాల్మీకివ్రాసెను. ఇపుడువిడిపోనినీస్తన చక్రములంజూచి చందురుఁడు పుట్టలోఁబుట్టిన వానిమాటసత్యమా? యనితలంచును.

(పాఠాంతరము)

తే. అమ్మ! చక్రస్తనద్వయీ! యరుగవమ్మ
యింటిలోనికి, లేకున్న నిట్టె నిన్ను
నరసి పుట్టఁబుట్టినవాని కంతకంటె
బహుగుణములున్నె? యని కోక వైరితలఁచు.

కం. ధరణీశ! నాగరాజా!
కరవాలము పూని రిపుల ఖండించెదవే
నురుతర కల్లోల శత
స్ఫురదాకృతి జలధి మోదమున నిండారున్.

భా. క్రొత్తనెత్తురుటేర్ల సంగమాశచే సంద్రమునకు సంతోషము.

కం. ఉదయమె కప్రపుగందము
మెదించితివి దేహమునకు, మృదు లాక్షం గెం
బెదవుల కలఁదితి చతురా!
యెది నీకత్యంత శోభ నీయక యుండున్?

భా. రతిచిహ్నాచ్ఛాదనార్థ మకాలమందలంకరించుకొనె.

చ. చెలియ సుపాణిబొట్టునిడి చేరిచిపాపట నాణిముత్తెముల్
గళమునఁ దారహారములఁగట్టి సుగంధము మేనఁబూసి వే
నలిఁ దెలిమల్లియల్ సెరివి నాణెపుఁదెల్లనిచీరఁగట్టి జా
బిలిమును మోమునంగెలిచి వెన్నెల నేఁడుజయింపఁగోరెడిన్

భా. జ్యోత్స్నాభిసారిక.

కం. బోటీ! చనవే యీనా
తాటంకము లతని హస్తతలమున నిడవే
యేటికి లేఖ లిఖింపఁగ?
జాటునివే నాదు దుర్దశావ్యథ లెల్లన్.

భా. కాటుకకంటినీళ్లచేఁ దడిసిన చెవికమ్మలు కొమ్మ వలవంతం దెల్పును.

కం. కాంతామణి విరహవ్యథ
శాంతిలఁ బెట్టితిమి కొన్ని సముచితభూషల్
వింతగ నవి యామెంఁడవిలి
యంతస్సారంబు గ్రిక్కినట్లుండెనయా.

భా. తామరతూండ్లను బైనిగప్పనవిశరీరతాపమునను నురువులుగ్రక్కుచున్నవి.

కం. (శ్రీ) రాముఁడు లంకకుఁ జను
దారి నొసంగని సముద్రు దండించుటకై
ఘోరానల శరముఁ దొడుగ
నారసి మేనాగిరీంద్రు లడలిరి మదిలో.

భా. రామశరము జలధిలోనితమకొడుకగు మైనాకుని బాధించునని.

తే. నింగి నిండుచందురుఁడు వెలుంగ వలపు
బలిమిఁ బ్రియుఁడేదొ చేయఁగాఁ దలకొనంగ
రత్నసౌధబింబిత నిశారమణుఁ గట్టు
వలువఁ గప్పియు బాల సిగ్గిలఁదొడంగె.

భా. రత్నసౌధమందుఁ బ్రతిఫలించినప్రియుని చేష్టకనఁబడకుంటకుఁ బ్రతిబింబచంద్రుంగట్టిన చీరవిప్పికప్పివైచి యావలవెన్నెలలోఁ దమ్ముం జూచికొని సిగ్గుపడెను.

ఉ. చెప్పనికార్యమేస్వమతిచేఁ దలపోసి యొన ౘదాన వే
నిప్పుడుచెప్పిపంపినది యింతిరో! కాయయొపండొ వేగమే
చెప్ప వెయంచు నేనడుగఁ, జేడియలెవ్వరె నీకుసాటినాఁ
జొప్పడుసిబ్బితిక్ వలువఁజూపును దూతికవాలుఁజూపులన్.

భా. ప్రియుఁడు ప్రమాదమునఁ దనచీరంగొనిపోవదూతినంపి దానిందెమ్మన్నది. అది తెచ్చిచూపుచున్నది.

తే. ఏ రుచిరతర కాసార నీరములను
దమ్మియుండదొ? వానిఁ బొనమ్మొనర్తు
నంచు భూతలంబెల్ల గాలించిచూచెఁ
బద్మముఖి కెందు నది కంటఁబడకపోయె.

భా. అన్ని సరస్సులఁ దనమోముదమ్మి ప్రతిఫలించి పద్మభ్రాంతిని గల్గించుచున్నది.

చ. కినుకఁద్యజింపు ప్రేమఁబరికింపు సుధోక్తులఁగుర్తిమ్మరింపు క
మ్మని కవుగింటనన్దనుపుమానిని! నేనిఁక నేరముల్ పొన
ర్పనిరతమట్టిప్రియమనుపల్కులతో బతిమాలుఁజిల్క శా
రినిమనయింటనత్త! విధికృత్యములిట్టివొ? వింతయయ్యెడిన్

భా. తన్ను భర్త రాత్రి బ్రతిమాలినమాటల నేవిని చిలుక పలుకుచున్నది. కోడలు దానినివిధిపైఁబెట్టుచున్నది.

చ. అతిమృదులాబ్జినీ దళసమంచితమీశయనీయ మద్దివా
సితముపటీరనీరపరిషిక్తత దానమృణాలనాళసం
తతులెసఁగెన్, స్వహస్తరచితంబదె చిత్రపటంబుమత్ప్రియా
స్థితిఁ దెలుపంగనింకఁజను దేరఁగ నేటికి లేఖలున్ సఖుల్

భా. ఆయా వస్తువులు సతీవిరహతాపముం దెల్పుచున్నవి.

ఉ. చేతముపల్లవింప దరిసించితిమబ్ధిఁ దరంగమాలి మీ
సేతువ దేడనూప్రుమని చేడియ వేడఁగఁ జూచి రామ భూ
నేత యదేమిచిత్రిమిట నేగదె కట్టితిమిప్డు లేదనన్
సీతముఖామృతాంశువును జెచ్చెర వెన్కకుఁద్రిప్పెనప్పుడున్.

భా. సీత తనముఖచంద్రి దర్శనమున నుప్పొంగిన సముద్రిని కల్లోలములచే సేతువుగనఁబడుట లేదని మొగముంద్రిప్పినది.

కం. పలుకుదురు తెల్లనగు న
ట్టులు తోముము తోము మిప్పుడున్ శోణత్వం
బెలయుచునె యుండె నిదిగో
తిలకింపవె విద్రుమోష్ఠి! తెలియద్దంబున్.

భా. శోణాధరము నరుణకాంతులు దంతపంక్తిపైఁబడుచుంటచే.

ఉ. రామనృపుండుగ్రుమ్మరియరణ్యములన్ మృగయాక్రియాప్రభూ
తామితఘర్మతోయ కణికావయుపుండయి యిల్లుచేర రా
భూమిజగాఢభక్తిఁ! బదముల్ గడుగంజని సన్నివిష్టయై
యేమొకో పాదమంటుకొనదిద్ధమణీవలయాళిమ్రోఁగఁగన్

భా. అహల్యవలెఁదన కంకణమణులును స్త్రీలగుదురేమోయనిసీత జంకెను.

ఉ. ఆమని జేనియేలుబడియందు లతాదులు నామ్రిదాడిముల్
జామలుమున్నుగాఁదగులుసంపదలన్దులఁదూఁగుచుండఁగా
భామయొకర్తు తాఁబగులఁబండిన పండొకదానిఁగోసిమా
గోమఖిలంబుఁజూచియనుఁగుంజెలినద్దముఁదెమ్మపొమ్మనెన్

భా. దాడిమబీజములు తనదంతములవరుసవలె నుండెనాయని చూడనద్దముం దెమ్మనె.

ఉ. పాములసొమ్ములొండొకటిప్రన్నని రాపిడిసందడింపఁగాఁ
గోమలపింగజూటమొక కొంతదిగంబడ భూతకోటులున్
సామమునన్నుతింపమలుసంజఁ గపర్దిమహానటుండుగాన్
భూమిసమస్తముందడిపెఁబో కఱిమబ్బులులేని వర్షముల్

భా. శివుఁడు తాండవముచేయుచో భ్రమరికాసమయమున శిరమందలిగంగా
జల మెల్లెడలంబడెను.

తే. ఇందువదన పున్నమ రేయిఁజందుఁ గాను
తప్పవై విధుంతుదుని వృథాగఁ దిట్టి
పోసెదవు దోసమెవరిదే ? మురవిరోధి
నడుగవే వాఁడు రాహువు మెడను గోసె

భా. చంద్రునివెళ్లఁగ్రక్కనని రాహువు నేలతిట్టెదవు? హరి రాహువుగొం
తుగోసెపొట్టలేని రాహువెట్లుచంద్రుని జీర్ణించుకొనును?

శా. ధారాధీశ! మహీమహేంద్ర! భవదిద్ధంబైన వీరవ్రత
ప్రారూఢిన్ సకలారిమర్దన తపోవ్యాపారమీవూన, నె
వ్వారల్ హానినిగందురంచెడఁదలోభావించెనో యింద్రుఁడ
వ్వారింబంపెను గావఁబోని, మఱినీవా దీక్ష వర్జించుటల్ ?

భా. యుద్ధమృతులు దివినచ్చరలఁగూడుదురు. నాగరాజుసల్పుయుద్ధతపమును
భంగమొనర్చిన నచ్చరలకాగోడుతప్పనుగా. అందుకచ్చరలంపఁబడిరి.

తే. అంగనామణి యోగ్ర మృగాంకువలన
బాధపడి సింహరాశిను భానుఁ దిట్టెఁ
గొంతతడవున కాశశి యంతికమున
సింహముంగని మది సంతసింపసాఁగె.

భా. సూర్యుఁడుదయింపలేదని -లేదా- అతనివలనఁజంద్రునకుఁ గళలువచ్చుచుండెననితిట్టెను. సూర్యగాశియగుసింహముసమీపమునకువచ్చుటచే జంద్రుఁడాయింటఁబ్రవేశించి పొడవడంగునని సంతసించె. సూర్యునితోఁగూడిన చంద్రుఁడుకనఁబడఁడుగా.

కం. శ్రీరామాయ నమో యని
సారెకుఁ బలుకందలంచి జనుఁడు మరల నా
తీరిట్టితఁడని దగునే?
నేరము కాదె? యనిమానినిరతి మెలంగెన్.

భా. మాని, నిరతితో మెలఁగె- మానినియొక్క రతితో మెలఁగె.

తే. చాపధరులు వెంబడిగాఁగ జానకీశుఁ
డతిరయమున దిగ్విజయార్థ మరుగుదేరఁ
గొంతమందికి శిరములు కొంత మంది
కీక్షితములు శూన్యములయ్యె నింతులందు.

భా. భర్తలుహతులగుటచే శత్రుస్త్రీలతలలుబోడులయ్యె. యుద్ధహతులు తమ్ముఁజేరుటచే దేవాంగన లెదురుచూచుటమానిరి.

ఉ. ఆలముచేయుచుండ భవదద్భుతవిక్రమకేళిఁజూచి జే
జే లెవరయ్య మెచ్చుకొని శీర్షములూపనివారు భూమిభృ
న్మౌళిసుధాంశుశేఖరుఁడుమాత్రమొకించుక సంశయించెను
త్తాలకపాలమాలికలఁదా సవరించుచు హస్తశాఖలన్.

భా. శివుఁడుశిరఃకంపన మొనర్చినచో శిరమందలిచంద్రుని యమృతముచింది పడి కపాలమాలిక సజీవితయగుననిశంకించె.

తే. దోర్బలులు దుర్మదాంధులు దుర్జయులు మ
హాసురులు వారిఁజంపు ధైర్యమ్ము దేల
హరికి సన్నగిల్లునో ? నిజాఖ్యాక్షరముల
నాల్కపై క్షణముంచు జనంబుఁగన్న.

భా. హరియనువారెల్లరు వచ్చినస్వర్గముపట్టదని.

తే. ధవునితోఁగూడి మద్యము ద్రావుచున్న
వనిత యొకతె యాయల్లకమును దలంచి
రత్నచషక బింబిత నిశారమణ బింబ
మొక్కదెసఁ గొనగోటితో నొక్కివైచె.

భా. చంద్రునియందలినఖాంకము వానిభార్యచూచి కోపించివాటాడకున్న
చోఁజంద్రుఁడువిరహవ్యథయెట్టిదో తెలిసికొనఁగలఁడని.

తే. §ప్రియవియోగభారమున రాత్రిఁగడపంగ
నేరక యొకర్తు పంకజనేత్రి కాల
యాపనార్థము మణివీణనంది కేల
నరసి యేణాంకునిఁ సుస్మితాస్యయయ్యె.

భా. చంద్రునిలోని మృగముగూడ గీతప్రియమని.

ఆ. రమ్యగాత్రి ! నాగరాజ ! వేఁటాడెడు
వేళ ధాణ మెక్కుపెట్టిన నిను
నట్టెచూచి యొక్క హరిణాంగనయు భయ
పడదు సరె ప్రమోదభరిత యగును.

భా. అనంగుఁడనిభ్రమపడి.

---

§ ఇది శార్ఙ్గధర పద్ధతియందుఁబ్రహేలికా ప్రకరణమునసముద్ధృతము.

కం. నామాట దాఁటెయెఱుఁగవు
కామిని! సలిపితిగదె కొఱగానిపని నిశ్శ
గోమల కపోలయోగ్యము
లౌమకరిక లునిచేఁ బ్రష్టమందు విభుండున్.

భా. ప్రియునకభిముఖిరై౦వశపడలేదు.

కం. రాముని మహోగ్రబాణ
స్తోమము మాయావుల దితిసూనులఁ దునుమన్
భూమిజము లసమయమ్మున
నేమిటికి కుప్పెత్తుగ ననలెత్తుచునుండెన్?

భా. నెత్తురువానవలన.

ఆ. ప్రణయకోపమంట పతులమ్రొక్కులుగొందు
రంట కామతంత్రలఁటవయస్య
లదియె నాగరికతయఁట పల్లెటూరివా
రలము మన కివేవి తెలియవమ్మ.

కం. జనపతి రాముఁడు రావణు
దనుజసహితుఁ జంపఁదివురఁదలఁతురు క్రవ్యా
శనులెల్లరు వనము మృగము
మునిని గపిని మిత్రసత్తములటం చెడఁదన్.

భా. మాంసముసమృద్ధిగా లభించునని. వనము = దండక. ముని = అగస్తి.
మృగము = బంగరులేడి; కపి = హనుమ. వధమఁదోడ్పడి రగుటమిత్రములు.

మ. అవునే పెద్దలసన్నిధిం బ్రియతమాయన్యోన్య సంభాషణం
బువిధుల్ ? పేర్మియసిభీతిచే నరుగుచున్ మోమెత్తి క్రేగంట నె
నవిలోకింపదుపోవుచోఁ బ్రిదులఁగఱరత్నాలుహారంబుఁ ద్రుం
చెవెసన్నే నునుయాలలూఁగ మదియుస్నీయూఁ ఉడింపంగదా

భా. ముత్యముల నేరుకొనుచుఁ బ్రియునిజూడవచ్చునని.

ఆ. ఈవు పుట్టినప్పు డిక్షుధన్వుండు మ
నమున సంతసించె నాగరాజ!
అంతమీఁద యుష్మదాచారముం జూచి
యపరిమిత విషాద మందసాఁగె.

భా. మదనునకు సహచరుఁడులభించెనని సంతసము. శివభక్తుఁడనివిషాదము కలిగె.

తే. ఒంటిదాని మానవతిని నింటవిడిచి
ముగ్ధత న్విదేశమునకుఁ బోవనెంచు
చెలువునకు నిజాశయమును దెలుపుటకును
సారెలెత్తుచుఁ జరమాడెఁ జానయోత్తు.

భా. చరమను జూదమున నొంటరియైనసారెచచ్చును. ఆయాటవిలంబహేతువును.

తే. భుజగములు భయంకరముఖంబులు సుధాంశు
మాళి శిరమునందుండఁగా మరుదధీశుఁ
డిదివఱకు భయపడు నిప్పు డించుకంత
యోచనమొనర్చి త్రాసంబు నుజ్జగించు.

భా. వాయుభక్షణములగుటం బాములంజూచి భయమును, దలపైఁజందురునిజూచి యమృతముండెంగాన నిర్భయమును వాయుదేవుఁడొందెను.

చ. తరుణిరొకావ్యఁగొల్వుమిఁకఁదక్కటిగాములజోలియేలయొ
క్కరుఁడతఁడాభిముఖ్యమునఁ గ్రాలిననీవిఁక నత్తవారి మం
దిరమున కేగఁబోవు పితనిన్నటకంపఁడు నీమనోరథో
త్తరముఫలించునంచుఁజెలికత్తెయనన్ సఖిమూతిద్రిప్పెడిన్

భా. చుక్కయెదురుగాఁ గన్యనత్తవారింటికంపరు. చుక్క = శుక్రుఁడు.

తే. వాహనము దిగివచ్చి సద్భక్తితో ష
డాననుండు పూజించుచున్నప్పు డీశు
నొడలిపాపసొమ్ములు భయపడి గజాస్యుఁ
డున్నయెడకుఁ బర్వెత్తఁగా నుద్యమించె.

భా. ఈశ్వరునిభూషణములగు పాములు కుమారస్వామివాహనమగు నెమిలిని జూచి భయపడి కన్నమువలెనున్న వినాయకునితొండమునఁ దూఱను ద్యమించెను.

ఆ. చూడు కాంతిదొఱఁగినాఁడు మృగాంకుండు
నేఁడు నీమొగమున కోడియేమొ ?
అనుచు విభుఁడు పలుకునప్పు డక్కననుండి
గూడ నేలవ్రాలెఁ గోమలాంగి.

భా. చంద్రుడుకాంతింబాయుట తెల్లవాఱిననే.అప్పుడే తెల్లవాఱె నేయనిభీతి.

కం. కఱకంఠు నవయవంబుల
నిరతము భూషణములగుచు నెగడు విషధరే
శ్వరు లేమి బెడిసిపడెనో !
పరస్పరము చూచుకొనుచు వణఁకుదు రౌరా!

భా శివునికంఠమందలి గరళముచూచి యేపాముకఱచి యపరాధము చేసెనో యని వణఁకిరి.

మ. అలివేణీ! కలదే పయోధరమొకం డందంచు వాక్రుచ్చి యా
వలబాహుంబయి కెత్తి చంద్రకళఁజూపన్ జేటి వక్రేందు రే
ఖల నెన్నింటినొ నీవు చూపఁగలవా కన్పించదేమి? యంచాడఁగా
జెలి యోజించి క్షణంబు పిమ్మట దరస్మేరాస్యయై పర్విడెన్.

భా. స్తనములు నఖాంకితములుగాన సిగ్గిలి పర్విడెను.

తే. కఠినుఁడా! యుష్మదాయల్లకమునఁ జూడు
వెలఁది కార్చిన కన్నీటి వెల్లువలకుఁ
దడిసి ముత్తెసరులును డెందము దహించె
మిడిసిపడుదురు గుణులును జడనియుక్తి.

భా. అతితాపమునఁ గాలుచున్న జాలునీరు దగులుటతో మఱియుఁ గాలును
గుణులు = గుణవంతులు, దారములున్న హారములు. జడనియుక్తి = జడు
లస్నేహము—జలములకూడిక.

ఆ. చంద్రశేఖరునకు జడలలో గృతమాల
మాలలుండెఁ బరిమళాలయమ్ము
లవి మరంద భృతములైనవే మఱి తేనె
తిండు లేల వానిఁ దేఁటి కనవో?

భా. ఱేలపూలమాలను జంపకమాలయనుకొని.

కం. కందర్పుఁడు యోగీశ్వర
బృందంబొందిన సమాధి భేదింపఁగ వి
ల్లందుకొని బాణమెత్తియు
సందేహించె నెది చేయఁజాలక బళిరే!

భా. ఈశ్వరసమాధి భేదనము చప్పున స్మరణకు వచ్చి.

ఉ. నీవు కిరీటికం బొఁగడు నేరుపు కాఁ డవు బాణవిద్య, నీ
పీవల కెప్డు దాఁటవు మదీరిత, మొందు విలాతి కేగు దే
న్నా విమలాస్య తుల్యమనినారు కళంకినిజందు ్రఁ గాన నే
దో విధివానిఁ గొట్టిపడఁ దో ్రసి మృగమ్ము దయానఁ బో ప్రియా

భా. చంద్రునిలోని మృగముం జంపినచోఁ జంద్రుఁడు కదలలేఁడు. అపుడు తెల్లవాఱదు. తెల్లవాఱినఁ గదా ప్రియుఁడూరికేగునది.

తే. ఆత్మవిభుఁడు సఖి నిదేశానుచరుఁడు
పంజరంబున శారిక వదరుఁబోతు
సవిధదేశమునందు నీసవతియిల్లు
వనిత ! విడవమ్మ మానమ్ము పనికి రాదు.

కం. ఇనుఁడు చరమవార్నిధిలో
మునుఁగఁ జనుచు నాత్మతాపమును దీక్ష్ణంబుక్
నినిచె నయో ! తత్తీరం
బునఁ దిరిగెడు నొక్క జంతువు మనంబందుక్.

భా. చక్రవాకముమదిలో విరహతాపము.

కం. స్మరమతసచివుఁ గళాన్వితుఁ
దరుణు శశాంకముఖుఁ గొల్చెదవు గాక యటం
చొరిమెఁ జెలి పల్క నాసుం
దరి తన కేలుఁగవ ముఖపిధాన మొనర్చెన్.

భా. ప్రియుఁడు చంద్రపక్షమువాఁడు గానఁ దన మొగముతమ్మి యగుటచే మూసికొన్నది.

తే. నల్లకీచ్ఛాయఁ బ్రియుఁ డాత్మసతికి మకరి
కలను గుచకుంభముల వ్రాయఁగాఁ దొడంగఁ
గాంచి కరమెత్తి ఘీంకృతుల్ గడలుకొనఁగ
వన్య మదకుంభి పరువెత్తి వచ్చునౌర!

భా. ఆమె స్తనకుంభములంజూచి కరిణియని మదగజము భ్రమపడినది.

చ. ధరణితనూజమోసమునఁ దాఁగొనిపోవఁగ రావణుండు, త
ద్విరహాభవాగ్నికీలలను వేగుచుఁజాలఁగృశించి రామభూ
వరుఁడటుక్రిందఁజూడఁ డటుప్రక్కలఁజూడఁడు పైనిజూడఁడో
క్కగుఁడుసమాధినున్నటులుకన్నుఁగనన్ముకుళించియుండెడిన్.

భా. క్రిందఁజూచినభూమి (అత్త) పైనిఁజూచినఁదన వంశమూలపురుషుఁడు సూర్యుఁడు, ప్రక్కలస్వజనము కనఁబడుదురని.

కం. స్త్రీతతిలోఁ గొత్తడియను
ఖ్యాతింగంటి జననింద కడుదొడ్డది యా
శీతమ్ము దాఁటిచను ప్రియ!
యే తెమ్మెఁక భావి శీత మే తేరకమున్.

భా. చలికిఁ బెదవులు పగులును.

ఆ. యామినీముఖమునఁ గామినీమణి యోష్ఠ
మలయగిరిని బుట్టె మలయుమంద
పవనములకు నులికి యవనమ్ముఁగానక
వానరులను దిట్టువాన ముంచె.

భా. సేతుబంధనార్థము మలయపర్వతమును జలధిలో వేయనందును.

కం. ఈపృథివి సహస్రము సీ
తాపతి ధర్మముగ నేలుతఱి నన్నుం బృ
థ్వీపతియనుచుం బిలుచుట
పాపము నన్నెవ్వ రట్లుపలుకకుఁ డనెడిన్.

భా. పృథివితన యత్తగారుగాన.

తే. ఇపుడుదుర్లభంబు లయినయీయశోక
వకులమాలికల్ పుష్పలావికను వేఁడి
తెచ్చితి గ్రహింపుమని యాదృతిం బ్రియుండొ
సంగినను మానిని గ్రహింపఁజాలకుండె.

భా. అశోకము చరణతాడనమున, వకుళముగండూషమునఁ బుష్పించెఁగాన వలదనెను.

తే. అమల'కర్పటి'గోత్రమ్మునందు"టాక
వంశజుఁడు" జాలపాఖ్యుఁడు వరలు వాని
నందనుండు ధారాపతి నాగరాజు
సుకవివంద్యుఁ డీభావశతకమువ్రాసె.

కం. భావశతకమ్మునకుఁ బ
ద్యావళి రచియించినాఁడ నరయఁగ నేత
ద్భావమ్ము లుభయభాషా
కోవిదుఁడను మిన్నికంటి గురునాథకవిన్.

# భావలీల

## చతుర్థాశ్వాసము

ఆ. కామమోహితుం డొకఁడు ముద్దరాలిని
వేగుజాము విడిచి వెడలునప్పు
డొక్కచోట అంప మొక్కచో సురియల
నొడలఁజూపి భీతి వడఁకెఁ బడఁతి.

(అంపము = మోవింబంటినొక్కులు, సురియలు = స్తనమున గోళ్లనొక్కులు

ఉ. కాకో? జ్వరంబొ? మామకును, గన్గవ నీకెటుపెక్కె వేఁడిసు
మ్మోకుల బావినీరుపడ దత్త!మొకించుక దూరమైన నోఁ
గాకపురాంతదీర్ఘికకు గ్రక్కునఁబోయి జలంబుఁదెత్తుఁబెం
జీఁకటిరాకమున్న నివచించెను గోడలుపూలుదాల్చుచున్.

మ. ఇదిగో-! యిప్పుడెవత్తు నేననుచుఁ బోయెన్దాను దారిన్గన
న్మదితా! కన్నులువాచె రాతిరదియేమోపోవ దీక్నోడికూ
యదయో వేఁగురుఁజ్కక రాదు మనదివ్యల్గాంతులన్బాయ వే
నెదిచేయన్మదిఁ ద్రోఁపదీబెడఁద నెల్లేదాఁటుటల్ చేటికా!

కం. పతి యనుకూలుఁడు సత్య
వ్రతుండు సుభగుండు రూపభావజుఁడు బహు
శ్రుతుఁ డన్యస్త్రీ విముఖుఁడు
సతత మతనికామినికి విచారంబేలా ?

సుభగుఁడు = మంచినక్షత్రమునఁగూడువాఁడు.

ఉ. కాకులుకూసెనత్త! యిదెకప్పిరిచీఁకటి తెల్లవాఱెఁగా
లోకులు నిద్రలేచుటకు లోపలఁబోయిననీరు చిక్కడిం
గాకయనంతరమ్మయినఁ గష్టమును మ్మెటునీటియెద్దడి
నొక్కకడవెట్టుటోయనుచుఁబోయెనొకర్తుకచూచుచాశలన్

సీ. తీర్చినకుంకుము, దీసిచాఁదిడిదానిఁ
దుడిచికస్తురిబొట్టు తడవుదిద్దు.
దువ్వెన ముంగురుల్ దువ్వనుగానగోళ్ల
నటుగీఱు నఱచేతనదిమిపట్టు
వేసినకొప్పువ్వెద విప్పికొప్పుమ్ముడివేసి
సరిగలేదని వాలుజడనమర్చు
విరిసరుల్ వ్రేలాడఁ జేరివికాదని విలు
వంపుగానొఁదలపట్టు గట్టు
పాన్పునలుమూల లూరక పట్టితిరుగుచుఁ
దానుగూర్చుండి నిలువుటద్దంబుసూచు
గాజులుకదల్చు మొలనూలుగజ్జెలంటుఁ
జీమచిటుకన్న నటు చూచుఁజిగురుఁబోఁడి.

ఉ. నిద్దురమాని క్రీడలాకొ నేత్రములెఱ్ఱవడెన్, సుగంధపుం
గ్రుద్దులుగుండెఁమీఁదనవిగో జితుఁడైతివె? యాటలోన నీ
దద్దులు గీఱలున్మశకతండము సేసెనొ? వీటికారసం
బిద్దరిచెంపజాఱెనదునింతి ప్రియుండరుదేర వేకువన్.

మ. ధ్రువనక్షత్రము వ్రాసి దానిదిగువన్ భ్రూల్లింతలంబెట్టుచుం
డువిసారంబులవ్రాసి వానికినిముందు న్వెన్కఁ గెంపారు వ
ట్రువబింబంబులువ్రాసి యెల్లెడల నెత్రింబిండు మబ్బుల్లిఖిం
చివచోహీనపుఁబ్రేమలేఖఁ బ్రియపంచెన్గాంతుఁడే తేరఁగన్

ధ్రువ = ఊరివుత్తరమున, విసారములు = (చేఁపలున్న) చెఱువు చెంతను; వట్రువబింబములు = (తూర్పుపడమరల నుదయించుచంద్రుఁడు నస్తమించు సూర్యుఁడుగల) పూర్ణిమనాఁడు. ఎఱ్ఱమబ్బులు = సాయంకాలము- రమ్మని లేఖార్థము.

ఉ. ఎల్లరుమోమునందుధరియింతురు కస్తురిబొట్టు వీనికిం
గల్లమునందలే ? వలపుగందపుబిల్లల మచ్చలేల వ
ర్తిల్లెనుగుండెరెం, డెడమరెట్టను గుండ్రనిగుంటయేటికే ?
అల్లరియేదియోజరిగెనక్కట ! కాంతుఁడుకందిపోయెనే !

చ. వెలఁదివయస్సునంకమున వెల్గుచుఁగ్రొవ్వొదఁదీర్చిగిల్గుటం
దెల మెలిసీలలూడ్చినినదించెడి గజ్జెలయొడ్డియాణ మ
వ్వలనిడి వ్రేలుచున్న పలు బన్నసరంబులఁదీసివైచి న
వ్వులు పరిహాసముల్ చెలఁగఁబొల్చెననంగుని బైసిమాలునో

మ. తినఁబెట్టంగఁగొఱంత లేదు, పతిప్రీతింజూచు నెల్లప్పు. డిం
టనుగార్యంబులొనర్ప సేవకులునున్నా, రన్వయాంకూరమి
తనయుండుండె నిరోగతాతరుణతార్థంబుల్ సమగ్రంబులై
నను నన్నేదొయతృప్తి యొంచు సతమున్బాధించు నే నెచ్చెలీ!

తే. తోడికోడండ్రు బానలు నాఁడుబిడ్డ
లత్తమామలు నీది గంపంత కాఁపు
రమ్ము పాడిపంటలు కొల్లలమ్మ! కాఁపుఁ
గొమ్మ! నీమొగమ్మేల దైన్యమ్ముఁజిమ్ము?

ఉ. పండినజొన్నచేని నడిభాగమునందొక మంచెమీఁద ని
ల్చుండియొకర్తు క్షేపణి సముద్ధతిఁద్రిప్పుచుఁబక్షులార! పో
పొండొకఁడైనఁగాక పలుమాఁకలువచ్చిననెట్లు? లంచుమ
న్నుండలుబాటఁబోవుయువకోత్తముచుట్టుఁబడంగవైచెడిన్

ఉ. నిద్దురలేవగానెతరుణీమణి నిద్దపుటద్దమందునన్
ముద్దుమొగంబుచూచుకొనిపోయిశుకంబునుముద్దులాడఁగాఁ
బ్రొద్దుననేయదేమిపనె? మోమయినంగడుగంగఁబోకయం
చొద్దకునత్తచేర మొగమోరకు ద్రిప్పితటాలునంజనెన్.

ఉ. ఏడువకయ్య! తండ్రికొఱకేడ్వకునాయన! తల్లితోడమా
టాడికొనంగనిమ్ము తదనంతరమేగద నేనునీవు పా
రాడెదునప్పుపోయి నడయాడెదునప్పుడువచ్చి నిన్నినా
ళ్లీడిచియీడ్వలేమటరయాక్షణ, మింతనెవచ్చిపోదుమా?

చ. వదినె! యిదేమిటేచినుఁగుపట్టిన దప్పడెక్రొత్తరైక; పూ
ల్వాదలుగఁగట్టితేల? కురులందొకఁడైనను లేదు ముంగురు
ల్వాదనముఁగప్పెదువ్వుకొనవా? గదియిక్కడికెంతదూరమూ
ర్చెదవలపెత్తినట్లుసవరించెద వెప్పుడుఁబైటనెందుకే?

ఉ. అమ్మకుఱంగటన్మెలఁగునప్పుడు నవ్వుచుఁజూడఁ, వొక్కవా
క్యమ్మునుబల్క, వేనుదఱియంగఁదొలంగుదువీనిసుంగుఁగై
కొమ్మనఁజేయిసాఁప, వఱిగూడనునీవలెనుండఁ డట్టినీ
కమ్మకచెల్ల! ఒక్కరితనైనపుడెక్కడలేని ప్రేమమా?

ఉ. ఏనునొసంగువిద్యము గ్రహింపకపోయిననేమి పాదముల్
చేనిడుకొంచునేఁగడుగఁజేర ననిష్టముచూపనేమి? నే
బోనముపెట్టఁగాఁదినకపోయిననేమి? దినంబునొక్కమా
రైనసుతుండునిన్ననఁగనత్తరో! వచ్చునిఁకేమికావలెన్?

ఆ. చెలమనీరు ద్రావఁ జేరునాజంతువు?
లరఁటిచెట్లనడుమ హరిణపదము
కలదటన్న నవ్వి కామిని యువకుఁడా!
లేదుకాఁపు కర్త లేఁడనియెను.

చ. నలుగురుచూచువేళఁదగునా? యిఁటుపైఁటచెఱంగులాఁగనే
వలనుకుఁజన్ననడ్డము గవచ్చెద వెంతటిపిచ్చి! యయ్యో! గా
జులుచిటులుజ్గయిన్విఁడువుచూడకునా మెడ్రవేలుహారముల్
పిలిచెద రేవొచూడుమని ప్రేయసియచ్చోఁటువాసిపర్విడెన్

చ. వదినెయసాధ్యురాలు మనవాసనపట్టదె? అత్తగన్న నా
బ్రతుకును బైటవేయదె? మఱందలెఱింగిన సిగ్గుమూట గ
ట్టదెయదెమామదగ్గడిఁదబాలునవచ్చునొయేమొయోరొవ
చ్చెదరని పైఁటలాగుకొనిచేడెచనెంగదినుండి నవ్వుచున్

ఉ. దూరమునందునున్నపుడు దుఃఖముమూలముపెల్లగిల్లునే!
తారుచునుండనింట నమితంబగు ధైర్యముమిన్నుముట్టునే!
చేరఁగఁ గేళికాగృహముచిత్తముచిందులుద్రొక్కునే! తదీ
యోరువునెక్క సంస్మృతియునుండదె నాథుఁడుగారడీఁడలే

చం. వెలఁదియొకర్తుపూలపొద వెల్వడివచ్చి సరస్తటంబున
న్నిలిచిననాతితో వదినె! నీళులఁజూచెద వేమిటేయనన్
జలజముతోడమండుక మొసంగిననే? మెటనుండివచ్చెయో
యెలమిని దేనెఁద్రావిచనుభృంగమటంచును బల్కునవ్వుచున్

ఉ. ఏయదిచూతువట్టు? లిటనెవ్వఁడు పుణ్యుఁడు లేఁడె? ఏల? పా
నీయమొసంగఁడే యొకఁడునీవెవఁ? డేఁబర దేశికుండ నీ
రేయినినన్నపానములఁ బ్రీతినొసంగెద నారగించి నీ
వే యెడ కేఁబరుండఁజను మింటమ? ఎవ్వరులేమి సుందరా!

చ. నలుగురువచ్చి పోవునిలు నాయనమాలిమిబాలుఁ డేడ్చియె
ట్టులోనిదురించె నిప్పుడు కడుంజెల రేగుచునుండె మింటమ
బ్బులు పెనువానలం దడిసిపోవును బంచఁబరుండనేల? లో
పలికినివచ్చిపండుకొను పాంథ యిఁకన్నగముండె రాత్రియున్

తే. అత్తవారింటికోడలు పెత్తనాల?
ఎంతసేపయ్యొ వెలుపలికేగి నీవు
ఎండ వేఁపపూవులు ధరియించితేమొ?
వ్రేలుముడిలోన నీ'షోకు' వీటఁగలయు.

మ. ఒడలెల్లం దిగఁజెమ్మటల్ గురిసె దీర్ఘోచ్ఛ్వాసనిశ్వాసము
ల్వొడమెన్గస్తురిబొట్టుజాఱెమొగమే మోగాఁగనుద్గన్నదు
న్వడిగాఁబర్విడియేలవచ్చితివి నాప్రాణాలురక్షింపనా?
పడఁతీనిన్నతగాని కై పనిపినేఁ బాపంబుఁగావించితిన్.

ఉ. ఎత్తినకాలగానిమఱి యెప్పుడుదించినకాలుఁలేదు నో
రెత్తినఁజాలునేరయిన నీవటఁదోఁచిడుణంబు లోపలం
బెత్తనమాచరించెదవు వేశ్యలవాడకుఁ బెద్దరాణి వే
అత్తరొ? నీవువాదెఱతువా ? యిఁక నెల్లరుఁబిల్లికూనలే.

ఉ. లిక్కినిరొండిదోఁపివిదిలించి పయంటనుగడ్డిగుడ్డమూఁ
పెక్కఁగఁజేసియత్త! కొడుకేగెను దూరపుచేనిచాయనే
దక్కినపుంబొలమ్మరిగదన్ బెసరేగతినున్నదోయటం
చొక్కతెపోయెవ్వకజల మూరఁగనున్నమురాల్చుచాకులన్

మ. చెలి ! నీ వభిముఖవైనన్
దిలకంబున కద్దమేల ? తృష కమృతపుసో
నల వేల ? తపనకుం జ
ల్వాల జేఁడేల ? సుఖమునకు స్వర్గంబేలా ?

మ. పరగేహంబుల కేగినంబరునితో భాషించినన్విసన్
జిరమొక్కగ్తుక యే మెలగ్గినఁబర శ్రేయంబుఁగాంక్షించినన్
బరునింజూచినడాసినంగటకటా ! ప్రాడైనలోకంబు త
త్తరుణీ రత్నమునాడిపోసికొను నిర్దాక్షిణ్యాదిత్తంబునన్.

ఆ. మొగము వాచినట్లు ఎగదిగఁ జూచెద
వార! ఱెప్పగొట్ట కందగాఁడ!
ఇచట నేమి వింత ఎసఁగె? నిస్సిరో? యొంటి
పాటు గూడ దెప్పుడు భామినులకు.

కం. తలవంచియె చనుచుండెం
దొలఁగెను మార్గంబు ముండ్లు దుంగలు పల్లం
బులు మిట్టలు ఱాలున్ ఱ
ప్పలు ద్రొక్కుచు నడవసాఁగె బడఁతి యెచటికో?

ఉ. బెల్లమునందుఁదీపిడితివే యెఱచీమలుపట్ట నేరమా?
కొల్లఁగఁబూవులన్మధువుఁ గూర్చితివేయళులాన దోసమా?
మల్లెలఁదావులుంచితివె మారుతుఁడెత్తుకపోవఁ బాపమా?
ఫుల్లసరోజగంధులను బుట్టఁగఁజేసితివేల దైవమా?

కం. నోరూరు వస్తువులఁ గ
న్నారఁగఁ జూపించి వాని నంటినయెడలన్
నేరమనుట నేరమె? నీ
నేరమి నది చాటదయ్యా నీరజగర్భా.

కం. వేళావేళలు లేవా
వేళము గదిలోని కరిగి విభుతో వేళా
కోళములకు దిగెదవు చా
ల్చాలును నవ్వారలె కోడలా! యెవ్వరైనన్.

ఉ. ఆవలివీధినున్న తమయమ్మగృహమ్మునకర్థి నొంటిమైఁ
బోవుచునుణ్డనయ్యెగురుఁబోఁడిఁగనుఙ్గొనిపూరుషాధముల్
తావిటుజేరఁబోయెడిఁగదాయనుచుణ్ హృదయంబుగల్మష
గ్రావకఠోరఘాతములకై గుటిసేసెద రేమికాలమో ?

ఉ. ఒంటిగఁబోవుచున్నయది యుగ్మలియయ్యెయొ వీధినుండి వె
న్నంటిపరాంగనారతి విహారవిలాస సుఖాభిలాషులే
కొంటెపనుల్పొనర్చెదరొకో యనుచున్న యమొద్దెదేలయొ
న్నంటికిశక్యమే ? పయికొనన్మది రాత్రికనిష్టమైనచో !

చ. జిలిబిలికొంజివుళ్ళనుసెజ్జఁబరుండియుశీరతాళవృం
తలలితవాయుసేవలనొనర్పననుంగుఁజెలుల్ వియోగినీ
లలనయనూరువానరదళప్రభువుణ్ రఘురాము విష్ణువున్
గలశజు రాహువున్ హరునిగామగుణధ్వనిఁదిట్టిపోసెడిణ్.

(ఈశ్లోకమును దీనితర్వాతశ్లోకమును మాతండ్రిగారు చదువుచుండ వింటిని. అనూరు = సూర్యరథము వడిగాఁదోలి ప్రొద్దుప్రొంకించినందుకు. సుగ్రీవు = సేతుబంధనసమయమున మలయపర్వతమునుసముద్రములో వేయింపనందుకు. రాము = కాకముంజంపినచోఁ గోకిలముండదుగదాయని. విష్ణువు = మన్మథుఁబుట్టించినందుకు. అగస్త్య = త్రాగినసముద్రోదకము వెళ్ళఁ గ్రక్కకున్న సముద్రమునుండి చంద్రుఁడుపుట్టఁడుగదాయని. రాహువు = మ్రింగిన చంద్రునేలవెడలఁ గ్రక్కవలయునని హరుని = మన్మథునేల మరలబ్రదికింపవలెనని. కామగుణధ్వని మదనువింటినారితుమ్మెదలు. వాని ఝంకారమును. ఇన్నియు గామోద్దీపకములు.)

తే. విటున కరుదెంచుతఱిని దెల్పుటకుఁ బెట్టె
లోన నొకవస్తువిడి మూసి దాని కావు
కొంటుకుఁ బైని సర్పమ్ము శంకరుని హనుమఁ
జంపకము వ్రాసి పంపె నబ్జముఖి దాని.

ఈశ్లోకముమల్లినాథసూరిది. అంగనచిన్న పెట్టెలోఁ బద్మకోశమును బెట్టెను. అదిపొద్దుగ్రుంకినపిమ్మట రమ్మనిసూచించును. ఆకోశమునుగాలిలోపలఁ దూఱి వికసింపఁజేయకుంటకు నాపెట్టెపైవాయువును భక్షించుసర్పమును మదనుఁడు దానింబాణముగాఁ గొనిపోకుండుటకు శంకరుని సూర్యుఁడుదాని వికసింపఁజేయకుంటకతనిమ్రింగుహనుమంతుని, తుమ్మెదలటువచ్చిదానివిప్పారఁజేయకుండుటకు సంపెఁగనుజిత్రించె. పద్మకోశమురక్షించుటకట్లామెచేసె

ఆ. ఔపనిషదభావ మాకళించుకొని సం
సారయాత్ర చేయు మనుజుఁడొకఁడు
తరఁగఁ దామరాకు దెరలఁ గాంచెడిని జి
త్రముగఁ గొలనుగట్టు దాపుచేరి.

తామరాకు జలమందున్నను దానికిజలమంటదు. అట్లేవిరాగియు సంసారమందున్నను దద్బాధలతనికంటవు.

కం. తమకపుఁబెల్లునఁ గ్రీడో
ద్యముఁడగు నుపపతికి వేగ నంజనమున హం
సము అంపముఁ గత్తిని జి
త్రమునన్ లిఖియించి చూపె రమణి మెలపునన్.

(తొందరపాటులేకుంటకు హంసమును. దంతక్షతబాధకుఅంపమును. నఖక్షతబాధకుఁగొడవటిని జిత్రించినది.)

తే. చూడుమా రామ వైభవస్ఫూర్తి నేచి
యాంజనేయుఁడు నాశనమాచరింప
జానకీదేవి యెంతయో సంతసించె
దుఃఖమొందెను రాక్షస స్తోమమెల్ల.

(రామవైభవమును నాంజనేయుఁడు నాశనము చేసెనన్నట్లు కలదు. చూడుము + ఆరామ వైభవము. అశోకవన వైభవము. హనుమ అశోకవనము భగ్నమొనర్చెను.)

ఆ. శౌర్య ధైర్యములను స్వర్గంబు నాక్రమిం
పంగ దానవుల్ కడంగఁ జూచి
దైత్యమర్దనుఁడు సుదర్శనంబునఁ జంపఁ
గడఁగి యాగె ఫలముగలదె? యనుచు.

(తన చేఁజచ్చినను నా రాక్షసులు స్వర్గము నాక్రమింతురుగదా యని హరియాగెను.)

తే. యువకుఁడా! నారికేళ ఫలోదకమ్మ
సుమ్ము తరుణీమణీ హృదయమ్ము సులభ
ముగ లభించునే? గుడము కరుగుటకైన
సమయ మావశ్యకం బేల సంభ్రమంబు?

కం. తరుణి హృదయమున వలపం
కురించుటకు నెన్నియెన్ని కూడవలయునో
యెఱుఁగుదువా? యువకుఁడ! సృ
ష్టిరహస్యము తెలియఁగ రిప్పటికి నెవ్వారల్.

తే. ఇరువలపు లొక్కొకప్డు కట్టెదురు నడచు
నొక్కొకప్డు డొంటరియయి చిక్కిపోవు
కారణము చెప్పలే డెట్టి ధీరుడైనఁ
బూర్వజన్మమున్నది వలపునకుఁగూడ.

తే. చుట్టఁ గాల్చుకొందును దీప మిట్టు లెమ్ము
గాలి కాఱకుండఁగఁ దల్పుఁ గదియవైతు
నతఁ డరకతోలుకొను చిప్ప డరుగునేమొ?
నిలువఁబడి నవ్వేదన దేల? కలికిమిన్న!

కం. పలుపు తెగ గుంజుకొనెడిన్
బులు మేయదు తండులీణము న్ముట్టదు ది
క్కులు మాఱుమోఁగ నఱచుం
గలదేయుపాయంబు? పెయ్యఁ గావ యువకుఁడా!

మ. అదియే? మెన్వారుపిల్తు? రంతమున కోయన్నట్లువిన్పించెదు
ర్గదుఁడాతా వ్రశిఖుణ్ణుగాఁడుగదయామాత్రంబుప్రాక్పుణ్యసం
పదనానంటియభాగ్యరాలికె? అయో! ప్రాణప్రియా! ఇప్పుడే
గదనీరాక ప్రియామకుంగినుక యే కల్గెంజుమీ నాపయిన్.

ఆ. ఉప్పొంగు మన్నఁ జాలు ను వ్వెత్తుగా లేచు
వలి పెమును ధరించి కలికి మేని
తళుకుతొంగిచూడ వెలికిఁ జనుచునుంటి
వెవని పున్నెము ఫలియించెనమ్మ!

ఉ. కజ్జలమింతపూయుదురె ? క్రాల్గనుఁగోనల, వేణినిండఁగా
గొజ్జెఁగపూలు చెక్కుదురె? గుత్తపుఁగంచెలనిక్కు చన్నవల్
విజ్జథరింతురే ? వలపువీడెపురంగును మోవినుంతురే ?
గజ్జెల మేఖలన్మొలకుఁగట్టుదురే ? యిఁకసిగ్గుఁగాతువా ?

కం. ఆదారిఁ గొలనికరుగక
మైదు వసంతమ్ములేగె నది యెత్తకు మె
ట్లో దినములు గడచుట మది
నూఁదిన గాయు మది మానుచున్నదియిపుడే.

కం. ఆముచ్చట లా మెచ్చుట
లాముద్దులు మురిపెములు నయములు ప్రియము ల
య్యో! మాఁటుమణఁగె పిలిచిన
చో మాటాడఁ డెదురైనఁ జూపఁడు మొగమున్.

ఆ. నాఁటిసంగతులను మాటికిం గదిపి క
న్నీటిపాం గవారిఁ బాటిలంగ
మేటిభృంగము పరిపాటినిం గనుచు నె
యేటి కంగలార్తు మాఁటినంగ!

తే. అటునిటుంజూచి గబగబ నరిగిగదికి
నప్ప బావ పరుండెడు నలరుపాన్పు
నందు మెయివాల్చి ముగుద నిల్వద్దమందుఁ
దన్నరసికొని లేచి యుద్ధవిడిఁ బఱచె.

తే. ఇదివఱకుఁ గలకలనవ్వు చేగుదెంచి
పైన ప్రక్కన పడి యేదొ వదరునీదు
చెల్లెలిప్పుడు పిలిచినఁ జేరరాదు
చిఱునగవుతో మొగముద్రిప్పి పఱచునేమొ!

కం. నలదమయంతుల రంభా
నలకూబరుల మఱి రత్యనంగులఁ దారేం
దుల రాధాకృష్ణుల నీ
చెలియ లనూఢ గది నొకతె చేరి యరసెడిన్.

ఆ. లతనె బిడ్డరీతి లక్షింతుఁ బోషింతు
నైనఁ బిందె పుట్టదన మఱఁదల!
ఏకజాతిసుమము లీను పుష్పాళ్లకు
కాయపడదటం చొకండు పలుకు.

తే. నానగా రింటిలోన నున్నారు చదువు
కొనుమనుచుఁ గొట్టు నాఁడుకోఁ జనుము తండ్రి!
యనుచు బెల్లము పెట్టి పుత్రు నటుపంపి
తరుణి గదిఁ జేరె నవ్వుచుఁ దలుపుమూసి.

కం. ఫలసిద్ధి నిశ్చితంబయి
వెలయుటఁ దమకింపఁడు తన వెలఁదిఁగవయ న
న్యాల పొందట్టులు గామిం
గళవళపడుఁ గటకటపడుఁ గక్కుర్తిపడున్.

కం. అతిపరిచయ మతివశ్యం
బతిసౌలభ్య మతిదాస్య మలరుటఁ జుమ్మీ
పతు లెద గణింప రెంతటి
చతురలు సుందరులయిన నిజ కళత్రములన్.

ఉ. బాలకుఁడేడ్చిన న్నిదురభంగము తక్కినవారికంచు నే
లీలనొ వానిఁ బక్కఁ బవళింపఁగఁ జేసియు నిద్రపుచ్చుచున్
జాలముసేయనట్లుఅవసాఁగిలి రేమిటి ? మంచినీళ్లటం
చాలెయొసంగఁగావలయునా ?పరులిచ్చినఁద్రావఁగూడదా

శా. ఏమాయల్లరి ? ఏమిటాపని ? బలేయిల్లాలుచేపడ్డ దే
నేమైన న్వెలయాలనా పురుషులాయిక్కంగయిందాఁకుచో
నేమాత్రింబును బాలునిల్వవఁట యిస్సీ ! యింకనిద్రింపరం
డీమీావా, రటుచప్పుడించెదరు పోనిం డావలన్వచ్చెదన్

ఉ. పిల్లలఁబోలెముద్దులను బెట్టెదుచప్పుడుగాఁగ దేహమం
దెల్లెడనంతటీపిగల దే ? మగవారికిసిగ్గులేదు సి
గ్గిల్లెడివారిసిగ్గుపరికింపరు చేతికిఁజిక్కిరంచొడల్
తల్లడపెట్టుచుందు రవలంబతిమాలుదురంత పిచ్చియా ?

కం. తమ కేమి తెలియనట్టులు
తమ కక్కఱలేనియట్లు తాము బలాత్కా
రమునవలన నొప్పినటు లు
త్తమ కులకన్యలు నటించెదరు పతి కవయన్.

మ. తమకీపద్ధతియుక్తమైనదియె ? నాథా! యన్ననాతండు పు
ష్పముపుష్పమ్మునకేగి భృంగమురసాస్వాదంబొనర్పంగ దో
సమెయన్న ! సతినవ్వియానిజమెపుష్పంబెన్నియో భృంగరా
జములందన్నట మాత్రముంగన మె?దోసం బేదిలేదంచనెన్.

తే. అవలకేగుడు మీచేతు లాడుచుండు
నొద్దనున్నచో నెప్పుడు నూరకుండ
రదిగొ బియ్యము చెరుగుట కంతసేపె ?
తెరిలె నెసరంచు నత్తయ్య యఱచుచుండె.

కం. ఈసొమ్ము మీదిగా దటు
గాసింబెట్టెదరు చాలుఁ గైకొదీయుఁడి య
భ్యాసము కూడదు రే పిటు
లేసాఁగిన బిడ్డ యేడ్పు లేగద చెప్పుఁడీ.

కం. మేనత్త కొడుకగుట నిది
గోనిసువంటి నతఁ డెత్తుకొను నెడఁదగులన్
రానియెడఁ దగిలెఁగే లది
తా నెఱిఁగి సలిపెనొ ? నావిధముఁ దెలిసికొనన్.

అ. చీఁకటిలోఁ దనప్రియుండేయనుకొని మఱొకనితో విటియనుచున్నది.

చ. ఎదురుగ రావుపల్కవు కయింబిగికౌఁగిటఁ జేర్ప వూరకుం
డెదు తడవేమిసేయక వడింజనుదెంచితి నింత చీఁకటిఁ
వదలుమకారణాగ్రహము బందులువచ్చిరి వేగిరింపు పూఁ
బొదనిటు నక్కితేల? యనిపొల్తిపయింబడె వాఁడెలర్పఁగన్

చ. పడమటిగాలిసాఁగె నిలువంగలమే? కిటికిని వేయు మె
ప్పుడుకనుమల్గునో తలుపుమూసిగ డెన్బిగియింపుమన్న నా
పడఁతిస్మితాస్యయై చెమటపట్టెను వీవనతోడ వీవుమం
చదుగకయున్న మీనుడివినన్నియొనర్చెదనాథ! యంచ నేఁ

ఉ. చాలును లెండు మోటుసరసాలెపుడుఁ గయినందుకోకతాం
బూలపుఁజుట్టలుంచుమని మోమునఁబండ్లనునొక్కి పట్టుటా?
వ్రేళుల, నొండ్లనొవ్వొఱుఁగ రేయన బేరియసి! నీవుగూడదం
తాలను నాపయింబఱపుదాన నెఱుంగుదుసర్వమంచ నేఁ

కం. భావము పొంగిపొరలి ఛం
దో వేషము వేసికొని మధురపదనృత్య
శ్రీ వెలయు నుభయభాషా
కోవిదుఁడగు మిన్నికంటి గురునాథు నెదన్.

కం. సూక్తినిధిఁ గన్న నెలమిన్
శక్తిని విజయమ్ము సుఖ మొసంగి మనుప వే
వ్యక్తాన్య క్తాకృతి స
మ్యక్తత్త్వము హరిహరాద్వయమ యమృతమ్మా!

సూక్తినిధి
సమాప్తము

# శర్మగారి గ్రంథములు

1. శ్రీ మద్గురు భాగవతము–11 12 స్కంధములకు
చక్కని ఆంధ్రీకరణము–3 వేల పద్యాలు 5–0–0
2. శ్రీ మద్భాగవతమహిమ – 6ఆ. ప్రబంధము 1–8–0
3. అడవి పువ్వులు, చక్కని నీతులు – అన్యోక్తులు 1–0–0
4. రామదాసు – విమర్శగ్రంథము 1–12–0
5. దత్తమహిమ – సులభమైన వచనము 450 పుటలు 2–0–0
6. గురుశిష్య వ్యాకరణము–ప్రతివిద్యార్థికి పనికివచ్చును 0–8–0
7. దత్తాత్రేయశతకము – భక్తిభరితము 0–4–0
8. మాఘపురాణము–10ఆ. 3 వేల పద్యాలు
శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహ కవి రచితము 5–0–0
9. రసవాహిని శ్రీ పి.వి.యల్.వి. ప్రసాదరావు రచితము 1–8–0

వలయువారికి అడ్రసు:-

మిన్నికంటి గురునాథశర్మ
బ్రాడీపేట 5వ లైను
గుంటూరు–2.